# వీక్షణం

ఆర్థిక, సామాజిక పత్రిక

సంపుటి : 2 సంచిక : 7, 8

ఏప్రిల్ 1-30, 2005


- భూకమతాల గణాంకాలు - ఫోకస్
- రాష్ట్రంలో ద్రవ్య వినియోగం
- కాగ్ నివేదిక
- నేపాల్‌లో రాజరికం
- నదుల అనుసంధానం

## భూకమతాల సైజు: సంఖ్య, విస్తీర్ణం 1990-91/2000-01

| కమతాల సైజు | కమతాల సంఖ్య | | కమతాల విస్తీర్ణం | |
|---|---|---|---|---|
| | 1990-91 | 2000-01 | 1990-91 | 2000-01 |
| 1.25 ఎకరాలు | 52.11 లక్షలు<br>(56.1) | 70.23 లక్షలు<br>(60.9) | 23.69 ల.హె.<br>(16.4) | 31.04 ల.హె<br>(21.5) |
| 2.5 నుండి 5 ఎకరాలు | 19.72 లక్షలు<br>(21.2) | 25.18 లక్షలు<br>(21.8) | 28.27 ల.హె.<br>(19.6) | 35.65 ల.హె.<br>(24.8) |
| 5 నుండి 10 ఎకరాలు | 13.45 లక్షలు<br>(14.5) | 14.24 లక్షలు<br>(12.4) | 36.39 ల.హె.<br>(25.1) | 37.95 ల.హె.<br>(26.4) |
| 10 నుండి 25 ఎకరాలు | 6.44 లక్షలు<br>(6.9) | 5.01 లక్షలు<br>(4.3) | 37.77 ల.హె.<br>(26.1) | 28.55 ల.హె.<br>(19.8) |
| 25 ఎకరాల పైన | 1.18 లక్షలు<br>(1.3) | 0.66 లక్షలు<br>(0.6) | (18.48 ల.హె.<br>(12.8) | 10.80 ల.హె.<br>(3.5) |
| మొత్తం | 92.90 లక్షలు | 115.32 లక్షలు | 144.60 ల.హె. | 143.99 ల.హె. |

బ్రాకెట్లలో సంఖ్యలు మొత్తంలో శాతాన్ని సూచిస్తాయి.
మూలం: డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, హైదరాబాద్

## వివిధ వర్గాలు-కమతాల సంఖ్య 1990-91/2000-01

| | సంఖ్య | | విస్తీర్ణం | |
|---|---|---|---|---|
| | 1990-91 | 2000-01 | 1990-91 | 2000-01 |
| దళితులు | 1183407<br>(12.7) | 1367420<br>(11.9) | 10.82ల.హె.<br>(7.5) | 11.34 ల.హె.<br>(7.9) |
| గిరిజనులు | 638703<br>(6.9) | 862738<br>(7.5) | 10.45 ల.హె.<br>(7.2) | 11.86 ల.హె.<br>(8.2) |
| ఇతరులు | 7468232<br>(80.4) | 9301787<br>(80.6) | 123.33 ల.హె.<br>(85.3) | 120.80 ల.హె.<br>(83.9) |
| మొత్తం | 9290342<br>(100.0) | 11531945<br>(100.0) | 144.60 ల.హె.<br>(100.0) | 143.99 ల.హె.<br>(100.0) |

బ్రాకెట్లలో సంఖ్యలు మొత్తంలో శాతాన్ని సూచిస్తాయి.
మూలం: డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్, హైదరాబాద్

# వీక్షణం

ఆర్థిక , సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్

సంపుటి: 2 సంచిక: 7, 8 ఏప్రిల్ 1-30, 2005

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

విడి ప్రతి: రు. 12
వార్షిక చందా: రు.150


సంపాదకీయం:

## ఏడాదిలో ఏమి ఒరిగింది ?

రాష్ట్రంలో కాంగ్రెస్-తె.రా.స. ప్రభుత్వం అధికార పగ్గాలు చేపట్టి ఏడాది కాబోతోంది. ఎన్ని కలలతో ప్రజలు ఈ ప్రభుత్వానికి అధికారం ఇచ్చారో ఆ కలలన్నీ భగ్నం అయినట్టో అవుతున్నట్టో కనబడుతున్నాయి. తొమ్మిది సంవత్సరాల తెలుగుదేశం పాలనలో అసంతృప్తికి, నిరాదరణకు, అన్యాయానికి, దౌర్జన్యానికి గురయిన సామాజిక వర్గాలన్నీ ఇక ఆ పాలనను రద్దు చేయాలని నిర్ణయానికి వచ్చినందువల్ల, దాదాపు అన్ని సామాజిక వర్గాలలో ఆ అసంతృప్తి గూడు కట్టుకున్నందు వల్ల 2004 ఎన్నికలలో కాంగ్రెస్ గెలుపు సాధ్యమయింది. నిజానికి అధికార పక్షంగా కాంగ్రెస్ ఎంత ప్రజా వ్యతిరేకంగా ప్రవర్తించగలదో తెలిపే చరిత్ర ఎంతో ఉన్నప్పటికీ, తెలుగుదేశం మీద వ్యతిరేకత కాంగ్రెస్ అనుకూలతగా పరిణమించింది.

తెలుగుదేశం మీద వ్యతిరేకతతో పాటుగా, వై ఎస్ రాజశేఖరరెడ్డి నాయకత్వంలో కనీసం 1999 నుంచి రాష్ట్ర కాంగ్రెస్ పోయిన కొత్త పోకడలు కాంగ్రెస్‌పట్ల అనుకూలతను పెంచాయి. ప్రపంచబ్యాంకు పాలనకు, ఆర్థిక సంస్కరణలను వ్యతిరేకించటం లోనయితేనేమి, చిన్నా పెద్దా ప్రజా ఆందోళనలలో భాగస్వామ్యం వహించడంలోనయితేనేమి కాంగ్రెస్ అసాధారణమైన ప్రతిపక్ష పాత్రను నిర్వహించి ప్రజా మద్దతును సంపాదించింది.

అటువంటి అనుకూలత మీద ఆధారపడి అధికారంలోకి వచ్చిన వారు అంతవరకూ తాము మాట్లాడిన వాటిలో సగమో, పావో అయినా మరిచి పోకుండా ఉంటారని, ఉండాలని ఆశించడం అత్యాశ కాదు. కాని కాంగ్రెస్-తెరాస ప్రభుత్వం వారు మాత్రం 2004 మే ముందు తాము ఏమి మాట్లాడారో, ఏమి చేశారో సంపూర్ణంగా మరిచి పోయినట్టున్నారు. కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలలో ఏ ఒక్క దాన్నయినా నెరవేర్చే దిశలో ప్రభుత్వ కార్యక్రమాలు సాగడం లేదు. ఎక్కడన్నా ఒకటీ అరా అటువంటి పనులు చేపట్టినా అవి ప్రజా ప్రయోజనాల కొరకు కాక కాంట్రాక్టర్ల కొరకో, ముడుపులు కొరకో, మరింత అధికారం కొరకో జరుగుతున్నాయి.

ప్రపంచబ్యాంకు పాలన యథావిధిగా సాగడం, అవినీతి విచ్చల విడిగా పెరిగిపోవడం, మద్యం ఏరులై పారడం, పోలీసులు మితిమీరిన దౌర్జన్య పాలన కొనసాగించడం, హింసారాజకీయాలు, ముఠాతగాదాలు ప్రబలి పోవడం, ప్రభుత్వ కార్యక్రమాలలో పారదర్శకత లోపించడం, ప్రచార ఆర్భాటంతో ప్రభుత్వం ఏదో చేస్తున్నదనే భ్రమ కలిగించడం, ప్రజా సమస్యల పరిష్కారం గురించి కనీస ఆలోచనలు చేయకపోవడం- ఒక్క మాటలో చెప్పాలంటే కాంగ్రెస్-తెరాస పేరు మీద తెలుగుదేశం పాలనే పునరావృతమవుతోంది. వై ఎస్ రాజశేఖర రెడ్డి రెండో కృష్ణుడిగా, రెండో చంద్రబాబు నాయుడిగా "సమర్థం" గా పాలిస్తున్నారు.

ఏడాది పాలన ప్రజలకు ఏం ఒరగబెట్టింది?

* * *

'వీక్షణం' ను ఇంకా ఎక్కువగా పాఠకుల దగ్గరికి చేర్చడానికి, పాఠకులతో నిత్యం సంభాషించడానికి, వీక్షణం నిర్వహణలో పాఠకులను భాగస్వాములుగా చేయడానికి జరుగుతున్న ప్రయత్నాలను మీరు గమనిస్తూనే ఉంటారు. వీక్షణం మీ పత్రిక. దీని పురోభివృద్ధికి మీ విలువైన సలహాలూ సూచనలూ అందించండి.

## లోపలి పేజీల్లో...



## చందాదారులకు విజ్ఞప్తి

వీక్షణం చందా ముగిసిపోయిన వారికి కూడ తిరిగి చెల్లిస్తారనే నమ్మకంతో ఈ సంచిక కూడా పంపుతున్నాం. సంవత్సర చందా రు. 150 వెంటనే పంపించి తమ చందాలను పునరుద్ధరించుకోవలసిందిగా చందాదారులందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం. వీక్షణం చందాను మనీ ఆర్డర్ రూపంలో వెంటనే పంపించక పోతే చందా పునరుద్ధరించబడదు. గమనించగలరు.

- సంపాదకుడు

## ఉత్తరాలు:

మొదటి సంచికలో ఎరిక్ ఫ్రామ్ 'పరాయికరణ' గురించి డి. పాపారావు గారి వ్యాసం పత్రికను ఎదురు చూసేటట్లు చేసింది. సీరియస్ విషయాన్ని మామూలు పాఠకులకు సైతం అర్థమయ్యేలా వ్యాసాలు ఉంటున్నాయి. అయితే అది మరీ తేలికైన సందర్భాలు సైతం ఉన్నాయి. ఉదాహరణకు గత సంచికలో 'నక్సలైట్ ఉద్యమం-కొన్ని ఆలోచనలు' అనే వ్యాసం గంభీరమైన టైటిల్ ఉన్నా అందుకు తగ్గట్టుగా సీరియస్ చర్చలేదు.

విదేశాంగ విధానం, పేటెంట్ వంటి విషయాల పట్ల వ్యాసాలు బాగున్నాయి. అట్లాగే 'వ్యాట్' గురించి కూడా దాని ఉద్దేశాలు, నేపథ్యం పై రాస్తే బావుంటుదని నా అభిప్రాయం. దాంతోపాటు గత రెండేళ్ళుగా రాష్ట్రంలో ఆత్మహత్యలు చేసుకున్న రైతాంగానికి సంబంధించి ఏ ఏ కులాల వాళ్ళు ఎంతమంది ఆత్మహత్య చేసుకున్నారు, భూమిలేని రైతాంగమా? ఉంటే ఏ మాత్రం ఉన్నది ? అట్లా విశ్లేషణాత్మక వ్యాసాలు వస్తే బావుంటుంది.

వంశీకృష్ణ
మహబూబ్‌నగర్

పత్రిక ఆసక్తిదాయకంగా ఉంటున్నది. సాహిత్య, కళారంగాల గురించి కూడ కొన్ని పేజీలయినా కేటాయిస్తే బాగుంటుంది. ముఖ్యంగా కులం, మతం, ప్రాంతం వంటి సమస్యల గురించి, దళితులు, ఆదివాసులు, మైనారిటీలు, మహిళలు వంటి సామాజిక వర్గాల గురించి అధ్యయనాలు, విశ్లేషణలు, వ్యాసాలు ఉంటే బాగుంటుంది.

రామారావు
హైదరాబాద్


**వీక్షణం**
ఆర్థిక, సామాజిక పత్రిక
సమతా పబ్లికేషన్స్,
సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్
మైత్రి రెసిడెన్సి, 3-6-394,
స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 025.
ఫోన్ : 040-55843495

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

# భూకమతాల గణాంకాలు 2000-01 ఒక విశ్లేషణ

- ఎన్. వేణుగోపాల్

కేంద్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖ కార్యక్రమం కింద దేశ వ్యాప్తంగా వ్యవసాయ గణాంకాల సేకరణ జరిగింది. సాధారణగా ఐదు సంవత్సరాలకు ఒకసారి జరిగే ఈ గణాంకాల సేకరణను రాష్ట్రంలో డైరెక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ నిర్వహిస్తుంది. గతంలో జరిగిన ఆరవ వ్యవసాయ గణాంకాల సేకరణ 1995-96 ఆర్థిక సంవత్సరం ప్రాతిపదికగా జరగగా, ప్రస్తుతం ఏడవ గణాంకాల సేకరణ 2000-01 ఆర్థిక సంవత్సరాన్ని ప్రాతిపదికగా తీసుకుంది. ఈ గణాంక సేకరణలో భూకమతాల సంఖ్య, విస్తీర్ణం, వివిధ సామాజిక వర్గాల యాజమాన్యంలో ఉన్న కమతాలు, కౌలు కింద సాగవుతున్న భూమి, భూవినియోగం, నీటిపారుదల, పంటల పద్ధతి, ఎరువులు, క్రిమిసంహారకాలు, విత్తనాలు వంటి ఉత్పాదకాల వినియోగం, మొదలయిన వివరాలను సేకరించి నివేదికలు తయారు చేస్తారు. ఈ నివేదికల వరుసలో మొదటిదిగా 'ఎ రిపోర్ట్ ఆన్ సెన్సస్ ఆఫ్ లాండ్ హోల్డింగ్స్ 2000-01' అనే నివేదికను డైరెక్టరేట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ ప్రచురించింది.

భూమికోసం పేద ప్రజల పోరాటలు, ప్రభుత్వాలు ప్రకటిస్తున్న భూసంస్కరణల, భూ అభివృద్ధి పథకాలు, నక్సలైట్లకూ ప్రభుత్వానికీ మధ్య జరిగిన చర్చలలో భూసమస్య వగైరా పరిణామాల నేపథ్యంలో భూ యాజమాన్యం గురించిన ఈ తాజా గణాంకాలను నిశితంగా పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది. ప్రస్తుతం వాడిగా, వేడిగా చర్చించబడుతున్న అంశాల గురించి కొంత సమాచారాన్ని అదనంగా చేర్చడానికి, చర్చను మరింత లోతుకు తీసుకుపోవడానికి ఈ గణాంకాలు తోడ్పడతాయి.

ఈ గణాంకాల నుంచి మొట్టమొదట గ్రహించవలసిన అంశం రాష్ట్రంలో మారుతున్న భూసంబంధాలు. పాత గణాంక సేకరణ జరిగిన 1995-96 నాటికి కొత్త గణాంకాలకు మధ్య గణనీయమైన తేడా ఉంది. ఇంకా ముందుకు వెళ్లి అంతకు ముందరి గణాంకాలను (అంటే 1990-91) గణాంకాలను చూస్తే ఒక దశాబ్ది కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో మారిపోయిన భూకమతాల సంఖ్య, కొత్తగా వ్యవసాయదారులైన వారి సంఖ్య, వారి చేతిలో వున్న భూవిస్తీర్ణం వివరాలు కొన్ని ఆశ్చర్యకరమైన ఫలితాలను, పరిణామాలను చూపుతాయి.

రాష్ట్రం మొత్తం మీద 1990-91లో 92 లక్షల 90 వేల భూకమతాలుండగా అవి 1995-96 నాటికి ఒక కోటి ఆరు లక్షలకు, 2000-01 నాటికి ఒక కోటి పదిహేను లక్షలకు పెరిగాయి. ఈ పెరుగుదల స్వభావాన్ని ఇంకా నిశితంగా అధ్యయనం చేయవలసి ఉంది గాని ఒక దశాబ్దిలో మొదటి ఐదు సంవత్సరాలలో 13 లక్షల కమతాలు పెరగడం, రెండో ఐదు సంవత్సరాలలో ఆ పెరుగుదల తొమ్మిది లక్షలుగా ఉండడం చూస్తే ఇది నేరుగా జనాభా పెరుగుదలకు సంబంధించినది కాదని, ఇతర కారణాలను అన్వేషించాలని తెలుతుంది.

ఇదే సమయంలో రాష్ట్రంలో సాగుకు లాయకయిన మొత్తం భూమి విస్తీర్ణం 1990-91లో ఒక కోటీ 44 లక్షల అరవైవేల హెక్టార్లున్నదల్లా, 1995-96 నాటికి ఒక కోటీ 43 లక్షల 73 వేల హెక్టార్లకు తగ్గి, 2000-01 కల్లా ఒక కోటీ 43 లక్షల 99 వేల హెక్టార్లకు పెరిగింది. ఈ హెచ్చు తగ్గులు కొన్ని వేల హెక్టార్లే గనుక వాటిని పరిగణనలోకి తీసుకోనక్కరలేదు. అటూ ఇటూగా భూవిస్తీర్ణం స్థిరంగా ఉన్నదనే చెప్పుకోవచ్చు.

అంటే స్థిరంగా ఉన్న విస్తీర్ణంపైన ఆధారపడే రైతాంగ కుటుంబాల సంఖ్య క్రమంగా, వేగంగా పెరుగుతున్నదన్న మాట. వ్యవసాయ రంగం నుంచి ఉపాధి కల్పన కోసం పారిశ్రామిక, సేవా రంగాల వైపు వెళ్ళి, వ్యవసాయం మీద ఆధారపడడాన్ని తగ్గించుకోవడం గణనీయమైన జనాభాకు ఇంకా వాస్తవరూపం ధరించలేదన్న మాట.

ఇందులోనే గ్రహించవలసిన మరొక ముఖ్యమైన అంశం ఈ భూ కమతాలలో కొనసాగుతున్న, పెరుగుతున్న భయంకరమైన అసమానతలు, తాజా గణాంకాల ప్రకారం రాష్ట్రంలో ఒక కొసన 82.75 శాతం కమతాల చేతిలో 46.32 శాతం భూమి ఉండగా 4.88 శాతం కమతాల చేతిలో 27.33 శాతం భూమి ఉంది. దీన్ని ఇంకా వివరంగా చూస్తే ఒక కొసన 60.91 శాతం సన్నకారు కమతాల చేతిలో 21.56 శాతం భూమి, 21.84 శాతం చిన్న రైతుల

*సన్నకారు కమతాలు 1990-91లో 56 శాతం ఉన్నవల్లా, 1995-96 నాటికి 59.42 శాతానికి, 2000-01 నాటికి 60.91 శాతానికి పెరిగాయి. చిన్న కమతాలు ఇదే కాలంలో 21.22 శాతం నుంచి 21.33 శాతానికి, 21.84 శాతానికి పెరిగిపోయాయి. కాగా మధ్య రైతుల కమతాలు 6.93 శాతం నుంచి, 5.31 శాతం నుంచి, 4.34 శాతానికి తగ్గిపోయాయి. పెద్ద రైతుల కమతాలు 1.27 శాతం నుంచి, 0.78 శాతం నుంచి, 0.54 శాతానికి తగ్గిపోయాయి.*

చేతిలో 24.76 శాతం భూమి ఉండగా, మరొక కొసన 4.34 శాతం మధ్య రైతుల చేతిలో 19.83 శాతం భూమి, 0.54 శాతం పెద్ద రైతుల చేతిలో 7.50 శాతం భూమి ఉంది. దీన్ని మరో మాటల్లో చెప్పాలంటే నలభై లక్షలమంది సన్నకారు రైతుల చేతిలో ఎంత భూమి ఉందో అరవై వేల మంది పెద్ద రైతులు అంత భూమి అనుభవిస్తున్నారు.

ఈ అసమానతలు గత దశాబ్ది మొదటికీ, మధ్యకీ, చివరికీ దాదాపు ఏ మార్పు లేకుండా ఉన్నాయి. ఏదన్నా మార్పు వచ్చినా అది అసమానతలు మరింత పెరగడంగానే ఉంది తప్ప తగ్గడంగా లేదు. 1990-91లో 77.30 శాతం చిన్న కమతాల దగ్గర 35.92 శాతం భూమి, 8.2 శాతం పెద్ద కమతాల దగ్గర 38.90 శాతం భూమి ఉండగా, 1995-96 నాటికి 80.75 శాతం చిన్న కమతాల దగ్గర 42.67 శాతం భూమి, 6.09 శాతం పెద్ద కమతాల దగ్గర 31.34 శాతం భూమిగా మారింది. తాజా గణాంకాలు కూడ ఈ ధోరణినే సూచిస్తున్నాయి.

ఈ దశాబ్దిలో కొట్టవచ్చేటట్టు కనబడుతున్న పరిణామం చిన్న కమతాల సంఖ్య పెరిగిపోవడం, పెద్ద కమతాల సంఖ్య తగ్గిపోవడం. సన్నకారు కమతాలు 1990-91లో 56 శాతం ఉన్నవల్లా, 1995-96 నాటికి 59.42 శాతానికి, 2000-01 నాటికి 60.91 శాతానికి పెరిగాయి. చిన్న కమతాలు ఇదే కాలంలో 21.22 శాతం నుంచి 21.33 శాతానికి, 21.84 శాతానికి పెరిగిపోయాయి. కాగా మధ్య రైతుల కమతాలు 6.93 శాతం నుంచి, 5.31 శాతం నుంచి, 4.34 శాతానికి తగ్గిపోయాయి. పెద్ద రైతుల కమతాలు 1.27 శాతం నుంచి, 0.78 శాతం నుంచి, 0.54 శాతానికి తగ్గిపోయాయి. భూవిస్తీర్ణం పెరుగుదల, తరుగుదలలు కూడ తగిన నిష్పత్తిలోనే ఉన్నాయి. అంటే పెద్ద రైతుల దగ్గర భూకేంద్రీకరణ, చిన్న రైతుల దగ్గర భూవికేంద్రీకరణ జరుగుతున్నదని అర్థం.

ఈ దశాబ్ది మొత్తం మీద కొంతయినా స్థిరంగా ఉన్నవర్గం చిన్న రైతులకు, మధ్య తరగతి రైతులకూ మధ్య (అంటే ఐదెకరాల నుంచి పది ఎకరాలలోపు) ఉన్న సెమి-మధ్య తరగతి కమతాలు.

తాజా నివేదికలో గుర్తించవలసిన మరొక అంశం షెడ్యూల్డ్ కులాల కమతాల సంఖ్య, వారి చేతిలో ఉన్న భూ విస్తీర్ణం. మొత్తం మీద రాష్ట్రంలో 2000-01లో 13 లక్షల 67 వేల షెడ్యూల్డ్ కులాల కమతాలున్నాయి. 1995-96లో ఈ కమతాల సంఖ్య 12 లక్షల 85 వేలుగా ఉండేది. వీరి చేతిలో 1995-96లో 10 లక్షల 66 వేల హెక్టార్ల భూమి ఉండగా, 2000-01 నాటికి అది 11 లక్షల 33 వేల హెక్టార్లకు పెరిగింది. విస్తీర్ణంలో కొంత పెరుగుదల ఉన్నప్పటికీ, కమతాల సంఖ్యలో కూడ పెరుగుదల ఉండడం వల్ల సగటు కమతం విస్తీర్ణం 1995-96లోనూ, 2000-01 లోనూ కూడ 0.83 హెక్టార్లు (దాదాపు రెండెకరాలు) గానే ఉండి పోయింది.

ఇక షెడ్యూల్డ్ తెగల భూయాజమాన్యం విషయానికి వస్తే 1995-96లో 7 లక్షల 54 వేల కమతాలుండగా 10 లక్షల 87 వేల హెక్టార్ల భూమి ఉండేది. 2000-01 నాటికి కమతాలు సంఖ్య 8 లక్షల 62 వేలకు పెరగగా, భూవిస్తీర్ణం 11 లక్షల 86 వేల హెక్టార్లకు పెరిగింది. పెరిగిన భూమి విస్తీర్ణం పెరిగిన వ్యవసాయ కమతాలతో సమాన నిష్పత్తిలో పెరగలేదు. గనుక సగటు కమతం విస్తీర్ణం 1.44 హెక్టార్ల నుంచి 1.37 హెక్టార్లకు పడిపోయింది.

వీటిని బట్టి తేలేదేమంటే సగటు షెడ్యూల్డ్ కులాల, తెగల వ్యవసాయ కమతాలు యథాస్థితిలో ఉండడం గాని, తగ్గిపోవడం గాని జరిగింది. సగటు అంకెలే ఇలా ఉంటే, వాస్తవంగా కమతాల వ్యవసాయ యోగ్యత, దళితుల, ఆదివాసుల వ్యవసాయ భూములకు నీరు, ఇతర ఉత్పాదకాలు అందే అవకాశం, వారికి సొంత పొలాల్లో పనిచేసుకునే అవకాశం మొదలయిన అంశాలను అన్నిటినీ పరిగణనలోకి తీసుకున్నప్పుడు రాష్ట్రంలోని ఒక కోటీ 15 లక్షల కమతాలలో షెడ్యూల్డ్ కులాల చేతిలో ఉన్న 13,67,420 కమతాలు (11,33,417 హెక్టార్లు), షెడ్యూల్డ్ తెగల చేతిలో ఉన్న 8,62,738 కమతాలు (11,85,890 హెక్టార్లు) నరైన వ్యవసాయాభివృద్ధి అవకాశాలతో లేవని తెలుతుంది. రాష్ట్రంలోని సన్నకారు, చిన్న కమతాలలో అత్యధికభాగం ఈ రెండు వర్గాల నుంచే ఉంటారు గనుక ఈ వర్గాల దగ్గర ప్రారంభించి వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాల రూపకల్పన జరగవలసి ఉంటుందనే విషయం ప్రస్తుత గణాంకాల ద్వారా మరొకసారి స్పష్టమవుతోంది. ❑

# కమతాల సంఖ్య, భూమి విస్తీర్ణం 2000-01

| | 1.23 ఎకరాలలోపు | | 1.23 నుండి 2.5 ఎకరాలు లోపు | | 2.5 నుండి 5 ఎకరాలు | | 5 నుండి 10 ఎకరాలు | | 10 ఎకరాలపైన | | కమతాల | భూమి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జిల్లా 1 | కమతాలు 2 | విస్తీర్ణం 3 | కమతాలు 4 | విస్తీర్ణం 5 | కమతాలు 6 | విస్తీర్ణం 7 | కమతాలు 8 | విస్తీర్ణం 9 | కమతాలు 10 | విస్తీర్ణం 11 | సంఖ్య 12 | విస్తీర్ణం 13 |
| శ్రీకాకుళం | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 19779 | 10606 | 5204 | 9033 | 2197 | 7247 | 605 | 3870 | 179 | 2912 | 27964 | 33664 |
| ఎస్టీలు | 13605 | 8393 | 7327 | 13185 | 4805 | 16070 | 1565 | 9942 | 313 | 5165 | 27618 | 52754 |
| ఇతరులు | 239521 | 137478 | 96671 | 170833 | 62536 | 213235 | 23529 | 155768 | 6515 | 104251 | 428772 | 781565 |
| మొత్తం | 272905 | 156477 | 109202 | 193050 | 69541 | 236552 | 25699 | 169575 | 7007 | 112328 | 484354 | 867983 |
| విజయనగరం | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 14905 | 8601 | 4620 | 8079 | 2027 | 16691 | 576 | 3737 | 192 | 3090 | 22320 | 30198 |
| ఎస్టీలు | 14482 | 9275 | 8759 | 15791 | 6960 | 23752 | 3201 | 21104 | 1166 | 17821 | 34568 | 87742 |
| ఇతరులు | 186493 | 105064 | 77505 | 138639 | 56613 | 196456 | 24544 | 164255 | 7959 | 127625 | 353114 | 732039 |
| మొత్తం | 215880 | 122939 | 90884 | 162509 | 65600 | 226899 | 28321 | 189096 | 9317 | 148536 | 410002 | 849979 |
| విశాఖపట్నం | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 7139 | 4691 | 3306 | 5780 | 1287 | 4298 | 367 | 2250 | 160 | 3322 | 12259 | 20340 |
| ఎస్టీలు | 21567 | 13647 | 17866 | 32619 | 22160 | 78944 | 18942 | 130428 | 9500 | 149027 | 90035 | 404665 |
| ఇతరులు | 200471 | 121109 | 81506 | 143055 | 46893 | 158772 | 15724 | 101603 | 4168 | 72635 | 348762 | 597174 |
| మొత్తం | 229177 | 139446 | 102678 | 181454 | 70340 | 242013 | 35033 | 234282 | 13828 | 224985 | 451056 | 1022180 |
| తూర్పుగోదావరి | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 52767 | 26725 | 8302 | 14200 | 3109 | 10320 | 915 | 5928 | 266 | 4374 | 65359 | 61547 |
| ఎస్టీలు | 9103 | 5911 | 6492 | 11925 | 8697 | 31063 | 8273 | 56222 | 4827 | 79909 | 37392 | 185030 |
| ఇతరులు | 322383 | 199062 | 121717 | 216137 | 75968 | 260133 | 31356 | 207915 | 9566 | 160404 | 560990 | 1043639 |
| మొత్తం | 384253 | 231674 | 136511 | 242263 | 87774 | 301515 | 40544 | 270065 | 14659 | 244700 | 663741 | 1290217 |
| పశ్చిమగోదావరి | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 32202 | 19560 | 10318 | 17984 | 5454 | 18584 | 1771 | 11164 | 424 | 9013 | 50169 | 76306 |
| ఎస్టీలు | 6862 | 4705 | 4453 | 8065 | 4169 | 14726 | 2712 | 18103 | 1276 | 20990 | 19472 | 66589 |
| ఇతరులు | 229899 | 153380. | 111672 | 199793 | 80674 | 278759 | 39851 | 265192 | 13564 | 207833 | 475660 | 1104957 |
| మొత్తం | 268963 | 177645 | 126443 | 225842 | 90297 | 312070 | 44334 | 294459 | 15264 | 237836 | 545301 | 1247851 |
| కృష్ణ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 37825 | 22776 | 13365 | 2349 | 6011 | 19656 | 1626 | 10547 | 471 | 8902 | 59298 | 85378 |
| ఎస్టీలు | 8102 | 5219 | 4020 | 7173 | 2500 | 8381 | 935 | 6224 | 292 | 4777 | 15849 | 31774 |
| ఇతరులు | 190405 | 135986 | 127078 | 228529 | 97942 | 335201 | 47377 | 317086 | 16950 | 263843 | 479752 | 1280646 |
| మొత్తం | 236332 | 163980 | 144463 | 259199 | 106453 | 363238 | 49938 | 333858 | 17713 | 277522 | 554899 | 1397798 |
| గుంటూరు | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 32019 | 20941 | 12335 | 21820 | 6266 | 20827 | 1686 | 10917 | 369 | 5036 | 52675 | 79541 |
| ఎస్టీలు | 6674 | 4945 | 5498 | 10100 | 4395 | 17872 | 1939 | 11891 | 224 | 3263 | 18730 | 45070 |
| ఇతరులు | 245524 | 178025 | 170360 | 305206 | 125659 | 434503 | 59361 | 395086 | 17972 | 262072 | 618876 | 1574892 |
| మొత్తం | 284217 | 203911 | 188193 | 337125 | 136320 | 470202 | 62986 | 417894 | 18565 | 270371 | 690281 | 1699503 |
| ప్రకాశం | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 30629 | 20432 | 15595 | 27849 | 14734 | 51245 | 5939 | 35652 | 754 | 13434 | 67651 | 148612 |
| ఎస్టీలు | 5026 | 3557 | 2822 | 5066 | 2595 | 8934 | 1117 | 6869 | 251 | 5345 | 11811 | 29771 |
| ఇతరులు | 150150 | 106306 | 116504 | 210269 | 124198 | 438867 | 78948 | 524593 | 31571 | 518819 | 501371 | 1798854 |
| మొత్తం | 185805 | 130295 | 134921 | 243184 | 141527 | 499046 | 86004 | 567114 | 32576 | 537598 | 580833 | 1977237 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **నెల్లూరు** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 45563 | 28437 | 18886 | 33338 | 11143 | 37591 | 2760 | 16873 | 402 | 6778 | 78754 | 123016 |
| ఎస్టీలు | 12306 | 7944 | 4276 | 7669 | 2185 | 710619 | 557 | 3270 | 68 | 1146 | 19392 | 27135 |
| ఇతరులు | 105606 | 70632 | 68997 | 124448 | 67619 | 237115 | 35502 | 234793 | 15071 | 263176 | 292795 | 930165 |
| మొత్తం | 163475 | 107013 | 92159 | 165455 | 80947 | 281812 | 38819 | 254936 | 15541 | 271100 | 390941 | 1080316 |
| **చిత్తూరు** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 45400 | 27785 | 21595 | 37816 | 12875 | 43771 | 3037 | 18332 | 225 | 3297 | 83132 | 131001 |
| ఎస్టీలు | 7439 | 4886 | 5129 | 9050 | 3653 | 12602 | 1192 | 7193 | 90 | 1326 | 17503 | 35057 |
| ఇతరులు | 193909 | 120961 | 125912 | 225383 | 117758 | 413174 | 54525 | 353037 | 15057 | 247934 | 507161 | 1360488 |
| మొత్తం | 246748 | 153631 | 152636 | 272248 | 134286 | 469547 | 58754 | 378562 | 15372 | 252557 | 607796 | 1526546 |
| **కడప** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 14492 | 9818 | 11435 | 19995 | 8933 | 31055 | 2913 | 16875 | 278 | 3903 | 38051 | 81646 |
| ఎస్టీలు | 2960 | 2030 | 2750 | 4873 | 2442 | 8512 | 986 | 6063 | 105 | 1492 | 9243 | 22971 |
| ఇతరులు | 92549 | 64430 | 84578 | 152634 | 98481 | 351479 | 61038 | 398702 | 18622 | 284265 | 355268 | 1251509 |
| మొత్తం | 110001 | 76279 | 98763 | 177502 | 109856 | 391045 | 64937 | 421641 | 19005 | 289659 | 402562 | 1356126 |
| **అనంతపూర్** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 14847 | 11473 | 17217 | 31549 | 20220 | 72919 | 11799 | 67718 | 1609 | 25058 | 65692 | 208717 |
| ఎస్టీలు | 3920 | 3075 | 5426 | 10080 | 8982 | 32518 | 5858 | 34936 | 1115 | 19301 | 25301 | 99909 |
| ఇతరులు | 72888 | 54417 | 92028 | 170734 | 97213 | 554149 | 128581 | 820801 | 57679 | 1035671 | 507679 | 2650350 |
| మొత్తం | 91655 | 68965 | 114671 | 212363 | 185705 | 674164 | 146238 | 923454 | 60403 | 1080030 | 598672 | 2958976 |
| **కర్నూలు** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 16718 | 13247 | 19676 | 35941 | 17080 | 59073 | 8982 | 58297 | 2662 | 202738 | 65118 | 209503 |
| ఎస్టీలు | 1839 | 1433 | 2569 | 4762 | 2770 | 9653 | 1679 | 11187 | 191 | 6064 | 9534 | 39320 |
| ఇతరులు | 71694 | 55543 | 89964 | 166525 | 121350 | 431487 | 96849 | 658122 | 57619 | 1058336 | 437476 | 2370012 |
| మొత్తం | 90251 | 70222 | 112209 | 207228 | 141200 | 500212 | 107510 | 7276052 | 60958 | 1113567 | 512128 | 2618835 |
| **మహబూబ్‌నగర్** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 37371 | 26632 | 29913 | 54441 | 26504 | 91323 | 11896 | 76491 | 3064 | 47525 | 108748 | 296412 |
| ఎస్టీలు | 14438 | 10947 | 15548 | 28867 | 19271 | 67263 | 10993 | 70291 | 3081 | 47547 | 63331 | 224916 |
| ఇతరులు | 134973 | 95898 | 123941 | 228757 | 150392 | 530519 | 107716 | 715258 | 53538 | 972896 | 570560 | 2543327 |
| మొత్తం | 186782 | 133476 | 169402 | 312065 | 196167 | 689105 | 130605 | 862040 | 59683 | 1067969 | 742639 | 3064655 |
| **రంగారెడ్డి** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 18461 | 12592 | 15557 | 28106 | 13478 | 46424 | 5609 | 35904 | 1056 | 15764 | 54161 | 138789 |
| ఎస్టీలు | 5897 | 4369 | 6681 | 12241 | 7245 | 24930 | 3896 | 24742 | 1052 | 16317 | 24771 | 82599 |
| ఇతరులు | 58956 | 40318 | 54242 | 99329 | 62949 | 221171 | 39493 | 263359 | 18969 | 340247 | 234609 | 964416 |
| మొత్తం | 83314 | 57279 | 76480 | 139669 | 83672 | 292525 | 48998 | 324005 | 21077 | 372328 | 313541 | 1185805 |
| **మెదక్** | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 46311 | 28148 | 26156 | 46567 | 17989 | 60935 | 5297 | 33550 | 1044 | 17589 | 96797 | 186789 |
| ఎస్టీలు | 7874 | 5310 | 7559 | 13842 | 7950 | 27308 | 3350 | 21504 | 918 | 14168 | 27651 | 82132 |
| ఇతరులు | 159020 | 97441 | 104567 | 188617 | 100992 | 352343 | 48696 | 323965 | 21916 | 417121 | 435191 | 1379488 |
| మొత్తం | 213205 | 130900 | 138282 | 249025 | 126931 | 440586 | 57343 | 379019 | 23878 | 448878 | 559639 | 1648409 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నిజామాబాద్ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 30571 | 20187 | 17056 | 30388 | 10708 | 35766 | 2611 | 16225 | 308 | 6296 | 61254 | 108863 |
| ఎస్టీలు | 10820 | 7906 | 9170 | 16626 | 7868 | 26469 | 2279 | 13832 | 341 | 5938 | 30478 | 70548 |
| ఇతరులు | 122891 | 78867 | 78266 | 141277 | 72430 | 25033 | 30670 | 200836 | 8868 | 161190 | 313125 | 832602 |
| మొత్తం | 164282 | 106961 | 104492 | 188291 | 91006 | 312667 | 35560 | 230893 | 9517 | 173424 | 404857 | 1012236 |
| అదిలాబాద్ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 24378 | 14798 | 15392 | 28215 | 15325 | 53456 | 11228 | 70279 | 648 | 17280 | 69673 | 218081 |
| ఎస్టీలు | 14243 | 9848 | 15946 | 29687 | 25421 | 90387 | 25778 | 164677 | 9141 | 132876 | 90529 | 427475 |
| ఇతరులు | 84250 | 52006 | 53902 | 98383 | 69019 | 245110 | 50185 | 328055 | 21951 | 364229 | 279307 | 1087783 |
| మొత్తం | 122871 | 76652 | 85240 | 156284 | 109765 | 388953 | 87191 | 563012 | 34442 | 548439 | 439509 | 1733340 |
| కరీంనగర్ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 52024 | 31601 | 23579 | 41545 | 13401 | 44998 | 3496 | 22166 | 621 | 8944 | 93121 | 149254 |
| ఎస్టీలు | 6668 | 4444 | 4532 | 8215 | 3768 | 12859 | 1366 | 8922 | 287 | 4382 | 16621 | 38821 |
| ఇతరులు | 177565 | 113879 | 114665 | 206504 | 105364 | 366935 | 51760 | 345054 | 17680 | 281624 | 67034 | 1313897 |
| మొత్తం | 236257 | 149924 | 142776 | 256265 | 122533 | 4246918 | 56622 | 376141 | 3803 | 106012 | 576776 | 1501972 |
| వరంగల్ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 37774 | 23317 | 15388 | 27244 | 9310 | 31507 | 3289 | 21435 | 988 | 31354 | 66819 | 137073 |
| ఎస్టీలు | 27885 | 18928 | 20684 | 37643 | 18742 | 64509 | 8384 | 55195 | 2976 | 50791 | 78671 | 227065 |
| ఇతరులు | 148741 | 93460 | 87298 | 157882 | 82034 | 286564 | 46522 | 312055 | 22684 | 438146 | 387279 | 1288107 |
| మొత్తం | 214400 | 135704 | 123370 | 222769 | 110086 | 382581 | 58195 | 388684 | 26718 | 522506 | 532769 | 1652245 |
| ఖమ్మం | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 20891 | 13585 | 9321 | 16497 | 6309 | 21521 | 2868 | 18448 | 818 | 13926 | 40207 | 83978 |
| ఎస్టీలు | 34689 | 25562 | 29179 | 53362 | 31209 | 109730 | 21423 | 139948 | 7602 | 110495 | 124102 | 439097 |
| ఇతరులు | 69180 | 49333 | 50727 | 92161 | 51503 | 180678 | 34459 | 231632 | 17142 | 298480 | 223011 | 852283 |
| మొత్తం | 124760 | 88480 | 89227 | 162020 | 89021 | 311929 | 58750 | 390028 | 25562 | 422901 | 387320 | 1375358 |
| నల్లగొండ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 41707 | 25866 | 21703 | 38789 | 16806 | 57674 | 6195 | 40473 | 261 | 9114 | 88198 | 190830 |
| ఎస్టీలు | 21615 | 15351 | 18685 | 34002 | 18478 | 63669 | 8864 | 57640 | 2494 | 37823 | 70136 | 208485 |
| ఇతరులు | 146430 | 96876 | 114443 | 208811 | 133813 | 472321 | 86060 | 579650 | 43249 | 741625 | 523995 | 2099283 |
| మొత్తం | 209752 | 138093 | 154831 | 281602 | 169097 | 593664 | 101119 | 677763 | 47530 | 807475 | 682329 | 2498598 |
| ఆంధ్రప్రదేశ్ | | | | | | | | | | | | |
| ఎస్సీలు | 673773 | 421817 | 335919 | 598674 | 241166 | 826882 | 95465 | 597127 | 21097 | 355040 | 1367420 | 2799540 |
| ఎస్టీలు | 258014 | 177684 | 205371 | 374842 | 216268 | 754254 | 135289 | 880182 | 47796 | 742186 | 862738 | 292917 |
| ఇతరులు | 3403498 | 2220520 | 2146543 | 3873896 | 2060690 | 7223883 | 1192746 | 7896817 | 498310 | 8622434 | 9301787 | 29837477 |
| మొత్తం | 4335285 | 2819947 | 2687833 | 4847412 | 2518124 | 8805019 | 1423500 | 9374127 | 567203 | 9719660 | 11531945 | 35566165 |

# జిల్లాల వారిగా భూమి ఉపయోగం 1955/56-2000/01

| జిల్లా | భూమి | అడవులు | పోరంబోకు విస్తీర్ణం | వ్యవసాయేతర | శాశ్వతపచ్చిక బయళ్లు | తుప్పలు దుబ్బులు | బంజరు | ఇతర బీడు భూమి | ఈ సం॥ బీడు భూమి | నికర సాగు భూమి | ఒక కారు కంటేఎక్కువ | మొత్తంసాగుకు యోగ్యమైనభూమి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| శ్రీకాకుళం | | | | | | | | | | | | |
| 1955-56 | 2520260 | 439050 | 458197 | 70305 | 94895 | 23792 | 218397 | 103357 | 176565 | 935700 | 279765 | 1215465 |
| 2000-01 | 1460725 | 177100 | 126025 | 224737 | 2327 | 6547 | 1175 | 9817 | 91517 | 819612 | 230155 | 1049767 |
| విజయనగరం+ | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| | 1575095 | 279922 | 194382 | 189840 | 12247 | 18487 | 9855 | 12130 | 37450 | 820610 | 269977 | 1090587 |
| విశాఖపట్నం | 3353262 | 1463105 | 380665 | 372115 | 354275 | 42430 | 74652 | 44022 | 147197 | 793647 | 144875 | 938522 |
| | 2835710 | 1194477 | 377635 | 213752 | 7620 | 83382 | 20475 | 18542 | 48060 | 871765 | 232950 | 1104715 |
| తూర్పుగోదావరి | 3679607 | 1409407 | 234752 | 187700 | 140350 | 50865 | 408595 | 52287 | 66162 | 1129487 | 220720 | 1350207 |
| | 2704607 | 807767 | 207765 | 304362 | 62055 | 20302 | 41385 | 53552 | 102970 | 1099532 | 812752 | 1912285 |
| పశ్చిమగోదావరి | 1954465 | 119860 | 222492 | 165800 | 687025 | 7675 | 231515 | 66252 | 104320 | 967847 | 210665 | 1178512 |
| | 1948845 | 202965 | 102820 | 273737 | 35027 | 19482 | 58905 | 23100 | 57745 | 1082205 | 660107 | 1742312 |
| కృష్ణ | 2263010 | 2272075 | 323365 | 88295 | 47910 | 61280 | 64502 | 24090 | 102450 | 1323910 | 252317 | 1576227 |
| | 2199235 | 165970 | 138357 | 373257 | 30127 | 14002 | 71850 | 63120 | 67032 | 1183330 | 603977 | 1787307 |
| గుంటూరు | 3737020 | 474355 | 379490 | 43525 | 95847 | 75980 | 111317 | 57710 | 312770 | 2186025 | 320657 | 2506682 |
| | 2832060 | 404852 | 88722 | 389797 | 60697 | 100452 | 90392 | 30547 | 58497 | 1588442 | 572717 | 2161160 |
| ప్రకాశం + | 0 | 0 | 0 | 0 | 0 | 0 0 | 0 | 0 | 0 | 0 | 0 | |
| | 4285155 | 1106250 | 389682 | 369097 | 165952 | 26765 | 156537 | 320852 | 220092 | 1526242 | 128952 | 1655195 |
| నెల్లూరు | 5153875 | 412310 | 1746227 | 350425 | 381725 | 50365 | 220692 | 90815 | 275627 | 1625687 | 220697 | 1846385 |
| | 3290105 | 616000 | 403252 | 580447 | 250040 | 42705 | 262335 | 214970 | 121587 | 749530 | 69022 | 818552 |
| చిత్తూరు | 3813447 | 1211027 | 422915 | 151755 | 81480 | 66027 | 368707 | 120502 | 420140 | 970892 | 129340 | 1100232 |
| | 3746925 | 1128352 | 410705 | 355905 | 91360 | 63667 | 99007 | 280225 | 236085 | 1081590 | 122957 | 1204547 |
| కడప | 3843022 | 1170417 | 162730 | 205920 | 1440525 | 21125 | 667500 | 28840 | 354175 | 1088262 | 74597 | 1162860 |
| | 3844595 | 1263737 | 595452 | 418950 | 38962 | 21935 | 172957 | 165157 | 162960 | 1004482 | 136372 | 1140855 |
| అనంతపూర్ | 4783720 | 488450 | 419057 | 272785 | 27307 | 32400 | 426457 | 232360 | 283922 | 2600980 | 106682 | 2707662 |
| | 4783730 | 491945 | 432372 | 404385 | 58352 | 74157 | 139575 | 231970 | 315657 | 2636440 | 120700 | 2757140 |
| కర్నూలు | 5963672 | 1714327 | 299740 | 135612 | 25722 | 10195 | 480620 | 114300 | 223097 | 2960057 | 141742 | 3101800 |
| | 4400085 | 795625 | 248435 | 249080 | 10187 | 5142 | 202445 | 281890 | 363510 | 2243770 | 235837 | 2479607 |
| మహబూబ్‌నగర్ | 4613485 | 795135 | 284897 | 166392 | 200307 | 28217 | 85785 | 131572 | 395977 | 2525200 | 25762 | 2550962 |
| | 4618102 | 666415 | 240345 | 199847 | 63075 | 15812 | 28122 | 257082 | 847447 | 2299955 | 191700 | 2491655 |
| రంగారెడ్డి + | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| | 1883117 | 182687 | 93765 | 219040 | 115190 | 18522 | 63205 | 161470 | 299765 | 729472 | 84275 | 813747 |
| హైదరాబాదు | 1889002 | 171402 | 181237 | 126742 | 193852 | 23480 | 59367 | 56957 | 207777 | 868185 | 19687 | 887872 |
| | 57505 | 0 | 29160 | 49020 | 0 | 0 | 7607 | 140 | 142 | 325 | 0 | 325 |
| మెదక్ | 2534647 | 222165 | 226387 | 137240 | 231095 | 46560 | 102165 | 145622 | 318377 | 1105035 | 76682 | 1181717 |
| | 2379757 | 238485 | 131175 | 183457 | 58525 | 12927 | 65885 | 162740 | 351980 | 1174582 | 226830 | 1401412 |
| నిజామాబాద్ | 1930235 | 363960 | 182025 | 148535 | 142917 | 17637 | 101050 | 74390 | 195955 | 703765 | 54595 | 758360 |
| | 2015537 | 423352 | 163935 | 186877 | 64670 | 8750 | 41240 | 145535 | 329017 | 652160 | 345925 | 998085 |
| ఆదిలాబాద్ | 3622027 | 1051127 | 476210 | 143570 | 148815 | 12907 | 190702 | 87272 | 235937 | 1275485 | 15672 | 1291157 |
| | 4050952 | 1723792 | 109797 | 151685 | 35585 | 23287 | 38710 | 236515 | 392890 | 1338690 | 58250 | 1396940 |
| కరీంనగర్ | 2962677 | 651810 | 208072 | 181817 | 162667 | 20570 | 85672 | 57710 | 291400 | 1302957 | 45287 | 1348245 |
| | 2971247 | 626025 | 209585 | 200322 | 137130 | 17827 | 48085 | 132865 | 551112 | 1048295 | 382035 | 1430330 |
| వరంగల్ | 2571787 | 329200 | 275535 | 155157 | 223410 | 26610 | 82355 | 82167 | 263925 | 1133427 | 73077 | 1206505 |
| | 3208880 | 928282 | 134492 | 147645 | 126002 | 9690 | 84797 | 291510 | 167970 | 1318490 | 283792 | 1602282 |
| ఖమ్మం | 2811515 | 1202607 | 186892 | 126255 | 174707 | 8425 | 102560 | 51045 | 84835 | 874187 | 4032 | 878220 |
| | 3952340 | 1859482 | 225952 | 312420 | 97342 | 47080 | 52702 | 54625 | 186202 | 1116532 | 61917 | 1178450 |
| నల్లగొండ | 3461300 | 238882 | 259952 | 147205 | 305022 | 12232 | 85085 | 128067 | 430140 | 1854712 | 112412 | 1965875 |
| | 3555810 | 214575 | 225862 | 298707 | 165220 | 22517 | 64362 | 393292 | 770722 | 1400550 | 240347 | 1645897 |
| ఆంధ్రప్రదేశ్ | 67452040 | 14155807 | 7330842 | 3377152 | 2926215 | 638775 | 4167700 | 1749342 | 4890752 | 28225452 | 2529270 | 30754722 |
| | 68600122 | 15498062 | 5250787 | 6296372 | 1687697 | 673445 | 1820487 | 3541650 | 5780415 | 27786605 | 6076552 | 33863157 |

+ అంటే ఆ జిల్లాలు అప్పటికి ఏర్పడలేదు

ప్రచురణ మూలం: బ్యూరో ఆఫ్ ఎకనమిక్స్ COMPENDIUM OF AREA AND LAND USE STATISTICS OF ANDHRA PRADESH
సూచిక: రెండున్నర ఎకరాలు ఒక హెక్టారు అనే ప్రాతిపదికగా పై గణాంకాలు ఇవ్వబడ్డాయి

# నల్లపిల్లిని ఉతికి ఆరేసినా తెల్లపిల్లి కాబోదు - ప్రభుత్వమూ అంతే

-వి. హనుమంతరావు

**యూరోప్‌లో కొన్ని దేశాలకన్నా వైశాల్యంలో పెద్దది ఆంధ్రప్రదేశ్. జనాభా ఎనిమిదికోట్లు. రాష్ట్రావతరణ సమయంలో కేవలం నూరుకోట్ల రూపాయలకు తక్కువగానే వున్న బడ్జెట్, నేడు 50 వేలకోట్ల రూపాయలు దాటింది. అలాంటి పెద్ద బడ్జెట్‌ను మానేజ్ చేయటమే కష్టం అనుకొంటే, రాను రాను మరింతగా అప్పులు తెచ్చి పరిపాలన చేయటం, దానితో పాటు ప్రపంచబ్యాంక్ వేలుపెట్టి, 'ఈ ఖర్చు వద్దు, ఫలానా చోట ఆదాయం పెంచు' అంటూ జోక్యం చేసుకోవటంతో, ఆర్థిక వ్యవస్థ మరీ కీకారణ్యంగా మారుతోంది.**

2004 కాగ్ నివేదికను పరిశీలిస్తే ప్రపంచబ్యాంకు వేలు పెట్టడమే కాదు, కాలు కూడా పెట్టి తలకాయ దూర్చాలనే ప్రయత్నంలో రాష్ట్రాన్ని ఆర్థికంగా మరింత ఇబ్బందులకు గురిచేసి, మరింత అప్పుచేస్తే తప్ప, మరోమార్గం లేని పరిస్థితిని కల్పిస్తున్నట్లు స్పష్టమవుతుంది. ఈ నివేదికలో ఎత్తి చూపిన అనేక లోపాలు, దిన పత్రికల్లో చోటు చేసుకోని అనేక వైఫల్యాలను మీ దృష్టికి తీసుకొని రావటం ఈ వ్యాసం ఉద్దేశ్యం. అప్పుల గురించి ప్రస్తావించాను కాబట్టి, ఆ విషయంతోనే ఈ పరిశీలన ప్రారంభిద్దాం.

### అప్పు నూరు, చేతికొచ్చింది ఎనిమిదిన్నర

కేంద్రం నుంచి, మార్కెట్ నుంచి రాష్ట్రం అప్పులు తెస్తుంది. చేసిన అప్పు తిరిగి చెల్లించకుండా వుంటే ఆర్థిక శాఖ మంత్రులకు ఎంత హాయిగానో వుండేది. కాని ఈ పాడు ప్రపంచంలో అప్పు తిరిగి చెల్లించాల్సి రావటమే కాదు; వడ్డీతోసహా చెల్లించాలి. 2003-04లో ఇలా తెచ్చిన ప్రతీ నూరు రూపాయల అప్పులో, అసలు, వడ్డీలు చెల్లింపుల తర్వాత చేతికి నికరంగా అందింది కేవలం ఎనిమిదిన్నర రూపాయలు మాత్రమే. అంతకు ముందు సంవత్సరంలో అయితే చేతికి చిక్కింది నాలుగురూపాయల ఎనభైపైసలే! ఈ కింది పట్టిక అయిదు సంవత్సరాల వివరాలను తెలియ చేస్తుంది.

చేసిన అప్పులో చేతికొచ్చిన నికర రుణం

(రు. కోట్లు)

| | 1999-2000 | 2000-01 | 2001-02 | 2002-03 | 2003-04 |
|---|---|---|---|---|---|
| తెచ్చినరుణం | 23343 | 27292 | 30446 | 26216 | 3806 |
| చెల్లించినరుణం | 21111 | 24114 | 28193 | 24955 | 30947 |
| నికర రుణం | 2232 | 3178 | 2253 | 1261 | 2859 |
| శాతం | 9.6 | 11.6 | 7.4 | 4.8 | 8.5 |

కొన్ని సంవత్సరాల్లో అయితే తెచ్చిన అప్పుకన్నా, చెల్లించిన రుణం ఎక్కువ వుంది. ఉదాహరణకు 2000-01లో కేంద్రం నుంచి రు.1889 కోట్లు తెచ్చుకొని, రు. 2701 కోట్లు, 2002-03లో రు. 2548 కోట్లు తెచ్చి రు. 4653 కోట్లు చెల్లించింది రాష్ట్ర ప్రభుత్వం.

అభివృద్ధి కావాలంటే అప్పు చేయక తప్పదని మాజీ ముఖ్యమంత్రి అంటూండేవారు. నాలుగు రూపాయలతో, ఎనిమిది రూపాయలతో ఏమి సాధించారో ఆయనే చెప్పాలి. ప్రస్తుత ముఖ్యమంత్రి కూడా అదే అప్పుల బాటలో పయనిస్తున్నారు కాబట్టి ఆయన కూడా ఆలోచించుకోవాలి. తెచ్చిన అప్పును ఉత్పాదక రంగాల్లో పెట్టుబడి పెట్టి, వచ్చిన ఆదాయంతో అప్పు చెల్లించేస్తామంటున్నారు ఆర్థికమంత్రి. అసలు అప్పుతెచ్చిన డబ్బు చేతికే రాకపోతే ఉత్పాదక రంగాల్లో పెట్టుబడి పెట్టేదెలా?

ఇంకో రకమైన రుణభారం ప్రభుత్వం నెత్తిన తెచ్చి పెట్టుకొంటుంది. సెమీ-ప్రభుత్వ సంస్థలు తమ కార్యకలాపాలను తమవద్ద నున్న నిధులతో నిర్వర్తించుకోలేక బ్యాంకులనుంచి రుణం తీసుకొందామంటే, రాష్ట్ర ప్రభుత్వం గ్యారంటీ వుంటే ఇస్తామనగా, ప్రభుత్వం గ్యారంటీలు ఇవ్వటం జరుగుతుంది. ఏతావాతా జరిగేదేమంటే ఇబ్బందుల్లోపడిన ఆ సంస్థలు రుణాలు ఎలాగూ తీర్చలేవు; వాటిని చెల్లించే బాధ్యత గ్యారంటీ ఇచ్చిన ప్రభుత్వం మీద పడుతుంది. అలా గ్యారంటీలు ఇచ్చి బాకీపడిన మొత్తం 1999-2000లో రు. 12683 కోట్ల నుంచి రు. 17427 కోట్లకు పెరిగింది. ఈ డబ్బంతా ప్రభుత్వమే చెల్లించాల్సి వుంది.

నిధులకొరత తీర్చుకోవడానికి ప్రభుత్వం అడ్డదారులు తొక్కుతుంది. అదేమిటంటే తీసుకొనే రుణం బడ్జెట్‌లో కనిపించదు కాని ప్రభుత్వమే చెల్లించాలి. వీటినే ఆఫ్-బడ్జెట్ రుణాలంటారు. ప్రభుత్వం తాను రుణం చేయదు; తన చెప్పు చేతల్లో పనిచేసే కార్పోరేషన్ల చేత రుణాలు చేయించి, ఆ రుణం మొత్తాన్ని తాను అప్పుగా తీసుకొంటుంది. మౌలిక సౌకర్యాల కార్పోరేషన్, పవర్ ఫైనాన్స్ కార్పోరేషన్, రోడ్ డెవలెప్‌మెంట్ కార్పోరేషన్ లాంటి సంస్థల చేత రు. 3918 కోట్లు రుణం చేయించి తన బొక్కసంలో

వేసుకొంది. ఇలా ఆ సంస్థలన్నింటికీ ఈ రుణం తీర్చాల్సివుంది. తాను మునగటమే కాక, ఇతరులను కూడా ముంచేసింది. రాజ్యాంగం రాష్ట్రాలకు మార్కెట్‌లో రుణాలు చేయడానికి అధికారం ఇచ్చింది కాని, ఇతరుల నెత్తిన చెయ్యి పెట్టడానికి కాదు. ఇది రాజ్యాంగ విరుద్ధం. శాసనసభ అనుమతి లేకుండా చేసిన రుణాలివి.

రాష్ట్రాలు రుణాల ఊబిలో దిగబడితే, కేంద్రం అంతకన్నా లోతుగా అదే ఊబిలో దిగబడి వుంది. కేంద్రం రుణభారం కేంద్ర రెవెన్యూ ఆదాయాన్ని మించిపోయింది. 2004-05 (బ.అం)లో రెవెన్యూ ఆదాయం రు. 309922 కోట్లు అయితే, వడ్డీతో సహ రుణం చెల్లింపులు రు. 327880 కోట్లుంది. అంటే కేంద్ర రెవెన్యూ ఆదాయం రుణాల చెల్లింపులకు సరిపోవడం లేదన్నమాట. రాష్ట్రాలు అలాంటి కేంద్రంవైపు సహాయం కోసం ఎదురు చూస్తే ఏం లాభం? సాధువూ సాధువూ రాసుకొంటే రాలేది బూడిదే.

మళ్లా రాష్ట్రానికివస్తే అప్పు తెచ్చేది పేరుకు అభివృద్ధి కోసం; కాని ఆచరణలో రోజువారీ ఖర్చుకోసమేనని కాగ్ నివేదిక తెలియ చేస్తుంది. ఆదాయం కన్నా, వ్యయం ఎక్కువైనపుడు, ఆ లోటును తెచ్చిన అప్పుతో తీర్చటం జరుగుతుంది. ఈ లోటు ప్రతి సంవత్సరం పెరుగుతూనే వస్తూంది. 1999-2000లో రెవెన్యూ లోటు రు. 1233 కోట్లుండగా, అవి 2003-04కు 3771 కోట్లకు పెరిగింది. అలాగే ద్రవ్యలోటు అదే కాలంలో రు. 4976 కోట్లనుంచి రు. 7450 కోట్లకు చేరింది. ఆర్థిక పరిస్థితి యాజమాన్యం గురించి రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంలో చేనుకొన్న ఒడంబడికలో పేర్కొన్న పరిమితులను దాటింది. ఈ ఒడంబడికలో రాష్ట్ర ప్రభుత్వం 2003-04లో అందుకోలేని ద్రవ్య లక్ష్యాలను ఈ కింది పట్టికలో చూడవచ్చు.

**అందుకోలేని లక్ష్యాలు**

(కోట్ల రూ)

| | ఒడంబడికలో లక్ష్యాలు | సాధన |
|---|---|---|
| రెవెన్యూ ఆదాయం | 27714 | 26869 |
| రాష్ట్ర సొంతపన్ను ఆదాయం | 14735 | 13806 |
| కేంద్రం నుంచి నిధులు | 10811 | 9458 |
| రెవెన్యూ ఖర్చు | 29846 | 30640 |
| ఫించన్లు | 2879 | 2425 |
| రెవెన్యూలోటు | 2132 | 3771 |
| పెట్టుబడి ఖర్చు | 5975 | 3441 |
| ద్రవ్యలోటు | 7338 | 7450 |
| మొత్తంరుణం | 59476 | 67855 |
| గ్యారంటీలు | 15709 | 18184 |
| బడ్జెట్ లెక్కల్లోకి రాని రుణాలు | 2335 | 3310 |

ఈ ఒడంబడిక ప్రకారం లక్ష్యాలను సాధించినపుడే కేంద్రం ఆర్థికంగా కొన్ని వెసులుబాట్లు కలిగిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వ వైఫల్యం వల్ల ఆ వెసులుబాట్లూ లభించవు.

ఆ ఒడంబడికలో చేర్చిన ఇతర లక్ష్యాలను కూడా చేరుకోలేక పోయింది. స్టాంప్‌డ్యూటీని సంస్కరించాల్సి వుండగా తాజా పారిశ్రామిక విధానంలో స్టాంప్‌డ్యూటీనే ముదరాఇస్తూంది. నీటి ఛార్జీలు పెంచుతామని మాట ఇచ్చి నిలుపుకోలేక పోయింది. (పోన్లెండి, మనం బతికిపోయాం) వ్యవసాయేతర భూముల విలువ (నాలా) ను సర్దుబాటు చేస్తామని చేయలేదు. ఇలాంటి వైఫల్యాలు ఎన్నెన్నోవున్నాయి.

నిధులు మంజూరు చేస్తారు గాని ఖర్చు పూర్తిగా చేయరు. ఖర్చు చేస్తారు గాని అనుకొన్న లక్ష్యాలు చేరుకోలేరు, చేయాల్సిన పనులు జరగవు. జరిగితే, లక్ష్యాలు చేరుకొంటే, అవి అందాల్సిన వారికందవు. ఇది ఈ సంవత్సరం బడ్జెట్ కథే కాదు; ప్రతీ బడ్జెట్ కథా ఇంతే. కాగ్ నివేదిక చెప్పిన కథ ఇదే.

మొన్న ముగిసిన శాసనసభా సమావేశంలో ఆఖరు రోజున 2003-04 తాలూకు కాగ్ నివేదిక అంద చేశారు. ప్రతీ సంవత్సరం ఇదే తంతు. ఎందుచేతనంటే ఆ నివేదిక ప్రభుత్వాన్ని ఉతికి ఆరేస్తుంది. ఆఖరు రోజున కాకుండా కొద్ది రోజులు ముందుగా విడుదల చేస్తే దాంట్లో విషయాలన్నింటినీ ప్రతివక్షం ఉపయోగించుకొని ప్రభుత్వ పక్షం మీద విమర్శనా బాణాలు సంధిస్తుంది. అయితే అర్థంకాని విషయమేమిటంటే ఆ నివేదిక చంద్రబాబు పాలన ఆఖరు సంవత్సరం తాలూకు నివేదిక. కాంగ్రెస్ అధికారంలో వుంది కాబట్టి, చంద్రబాబు పాలనను ఎండేయడమే కాంగ్రెస్ 'ధర్మం' కాబట్టి ముందే విడుదల చేసివుంటే, కాంగ్రెస్ సభ్యులు టపాకాయలు పేల్చి వుండేవారు కదా. దీనర్థం చంద్రబాబు పాలనలోనే కాగ్ నివేదికలో ఎత్తి చూపిన లోపాలు జరిగాయి, అంతకు ముందు కాంగ్రెస్ పాలించినపుడు ఇలాంటి లోపాలు జరగలేదని కాదు. అప్పుడూ ఇవే కథలు; కాగ్ నివేదిక ఎత్తి చూపిస్తూనే వచ్చింది.

తాజా నివేదిక పుటలు తిరగేస్తుంటే బడ్జెట్ మొత్తం కేటాయింపు, మొత్తం ఖర్చు వివరాలు కనిపించాయి. చేసిన కేటాయింపు కన్నా ఎక్కువ ఖర్చే జరిగిన గణాంకాలు కనిపించాయి. ఇదేమిటని వివరాలు చూసే నరికి అసలు రహస్యం బయట పడింది. అదేమిటో తర్వాత చెబుతా. అంతకు ముందు సంవత్సరాల్లో ఈ విషయంలో ఏం జరిగిందోనని గత అయిదు సంవత్సరాల కాగ్ నివేదికలు పరిశీలించా. అందులో వున్న వివరాలు మీముందుంచుతున్నా.

కేటాయింపు, ఖర్చు మిగులు/ తరుగు

(రు. కోట్లు)

| సంవత్సరం | కేటాయింపు | ఖర్చు | ఆదా |
|---|---|---|---|
| 1999-00 | 34404 | 30783 | 3621 |
| 2000-01 | 41603 | 38457 | 3146 |
| 2001-02 | 46338 | 43161 | 3177 |
| 2002-03 | 43580 | 39206 | 4374 |
| 2003-04 | 43736 | 49407 | +5669 |

ఆఖరి సంవత్సరంలో ఆదా చేయకుండా ఆదాయం కన్నా ఖర్చు ఎక్కువ ఎందుకైందని చూడబోతే, ఆ సంవత్సరంలో అప్పు ఆరువేల కోట్లు చేయాలని బడ్జెట్‌లో అంచనా వేస్తే చేసిన అప్పు 13 వేల కోట్లు దాటింది. అంటే ఆదాయం అంతమేర పెరిగి, మిగులు చూపింది. లేకపోతే ఈ సంవత్సరంలో కూడా రెండు వేలు మాత్రమే ఆదా అయ్యేది. కాగా మొత్తం అయిదు సంవత్సరాల్లో 16 వేలకోట్లు ఖర్చు చేయకుండా మిగిల్చేసిన ఘనత అప్పటి ప్రభుత్వానిదే. ఏయే పద్దుల కింద చేసిన కేటాయింపు ఖర్చు కాలేదోనని చూస్తే విద్య, వైద్యం, రహదారులు, పంచాయతీరాజ్ లాంటి పద్దుల కింద చేయాల్సిన ఖర్చు చేయలేదు. ఎందుకు ఖర్చు కాలేదంటే మనకు తెలిసిన రెండు జవాబులున్నాయి. 1) పాలనా వ్యవస్థ అసమర్థత, 2) నిధుల్లేక ఖర్చు చేయలేక పోవటం. ఏది నిజమో అప్పటి ప్రభుత్వ నాయకులు చెప్పరు; ఇప్పటి ప్రభుత్వ నాయకులు చెప్పబోరు. ఎందుచేతనంటే వచ్చే సంవత్సరం కాగ్ నివేదిక కూడా ఇలాంటి ఫలితాలనే చూపిస్తుంది కనుక.

పేనుకు పెత్తనం ఇస్తే తలంతా తెగ కొరికిందని సామెత. ప్రజలు తెలుగుదేశం పార్టీని రెండుసార్లు గెలిపించి అధికార పీఠం మీద కూర్చోపెడితే ఎనిమిది కోట్ల ప్రజలు చెల్లించిన పన్ను ఆదాయాన్ని బాధ్యతతో, నమ్రతతో ఖర్చు చేయకుండా ద్రవ్య పరిస్థితిని అధ్వాన్నంగా తయారు చేసింది. ఎడమచేత్తో, కుడిచేత్తో అప్పులు తెచ్చింది. ఎందుకంటే అభివృద్ధి కోసమని చెప్పింది. కాని కాగ్ నివేదిక "ద్రవ్యలోటుకు, రెవెన్యూ లోటుకు మధ్య నిష్పత్తి 99-00లో 25 శాతం నుంచి 03-04లో 51 శాతానికి పెరిగింది" అని చెప్పింది. పామర భాషలో చెప్పాలంటే "అప్పు తెచ్చిన డబ్బులో సగం రోజువారీ ఖర్చుల కోసం వినియోగమైంది" అని కాగ్ నివేదిక వాత పెట్టింది. అంతే కాదు " ఈ నిష్పత్తి ఇలా పెరుగుతూండడం అంటే రాష్ట్ర ఆస్తులు తరిగిపోవటం" అని వివరించింది. దీనర్థం ప్రజలు సమకూర్చిన నిధులు, తెచ్చిన రుణం ద్వారా సమకూర్చుకొన్న నిధులూ చాలక ఆస్తుల పునాదుల్నే లేపేయటం ప్రారంభమైందన్నమాట. ప్రపంచబ్యాంకు కనుసన్నల్లో, దాని నాయకత్వంలో నడిస్తే ఏం జరుగుతుందో పై వివరణ స్పష్టం చేస్తుంది. ఈ నివేదిక ద్రవ్య వ్యవస్థలో లొసుగులనెన్నో బహిర్గతం చేసింది. కొన్ని ఉదాహరణలు.

- రెవెన్యూ, సొంతపన్ను ఆదాయం, రెవెన్యూ ఖర్చు, పెట్టుబడి ఖర్చు, రెవెన్యూలోటు, ద్రవ్యలోటు, రుణభారం-వీటిలో ఏ ఒక్క పద్దుకింద ప్రభుత్వం తానే ఏర్పాటు చేసుకొన్న లక్ష్యాలను సాధించలేక పోయింది.
- మొత్తం ఖర్చులో రెవెన్యూ పద్దుకింద ఖర్చు 03-04లో 86 శాతానికి పెరగటం వల్ల ఆస్తులను సమకూర్చుకోవడానికి ఏమీ మిగల్లేదు.
- పెద్ద ఎత్తున రెవెన్యూ, ద్రవ్యలోట్లు పెరగటం ద్రవ్య పరిస్థితి సమతూకం చెదిరిపోవడాన్ని తెలియ చేస్తుంది.
- వడ్డీ చెల్లింపులు పెరగటం, రుణంగా తెచ్చిన నిధులు అభివృద్ధి కోసం ఏమీ మిగలక పోవటం జరుగుతుంది.
- ఎక్కువరుణం, ఎక్కువవడ్డీ చెల్లింపుల మూలంగా రాష్ట్రం రుణాల ఊబిలో (డెట్ ట్రాప్) కి దిగజారుతుంది.
- ప్రభుత్వం చేసిన మొత్తం ఖర్చులో 22 శాతం ఒక్క మార్చి నెలలోనే జరిగింది.
- ప్రతీ ప్రభుత్వ శాఖలో ఖర్చును ఆ శాఖ కంట్రోలింగ్ ఆఫీసర్లు, ఎక్కౌంటెంట్ జనరల్ దగ్గర వున్న లెక్కలతో సరిచూచుకోవాలి. కాని ఆడిట్‌లో బయటపడినదేమంటే 21 శాఖల్లో రు. 11209 కోట్ల ఖర్చును సరిచూడటం జరగలేదు. ఈ విషయంలో నీటి పారుదల శాఖ, విద్యుత్ శాఖ అగ్రభాగాన వున్నాయి.

పేనుకు పెత్తనం ఇస్తే తలంతా తెగ కొరికిందని సామెత. ప్రజలు తెలుగుదేశం పార్టీని రెండుసార్లు గెలిపించి అధికార పీఠం మీద కూర్చోపెడితే ఎనిమిది కోట్ల ప్రజలు చెల్లించిన పన్ను ఆదాయాన్ని బాధ్యతతో, నమ్రతతో ఖర్చు చేయకుండా ద్రవ్య పరిస్థితిని అధ్వాన్నంగా తయారు చేసింది. ఎడమచేత్తో, కుడిచేత్తో అప్పులు తెచ్చింది. ఎందుకంటే అభివృద్ధి కోసమని చెప్పింది.

- బడ్జెట్‌లో కేటాయింపు చేయకుండానే 03-04లో రు. 1364 కోట్లు ఖర్చు అయింది.
- బడ్జెట్‌లో వివిధ శాఖలకు కేటాయింపులు జరుగుతాయి. కొన్ని సందర్భాల్లో కేటాయింపును అధిగమించి ఖర్చు చేయాల్సి రావచ్చు. అలా అదనంగా చేసిన ఖర్చును శాసనసభకు తెలియచేసి ఆమోదాన్ని పొందాలి. కాని 1997-98 నుంచి 02-03 మధ్య కాలంలో రు. 2950 కోట్ల రూపాయలు, 03-04లో రు. 2098 కోట్ల రూపాయల ఖర్చును శాసనసభ ఆమోదానికి పెట్టనే లేదు. ఇది రాజ్యాంగ విరుద్ధం.
- 25 శాఖల్లో ఖర్చు చేయకుండా మిగిలిపోయిన రు. 1849 కోట్ల సొమ్మును ఆయా శాఖల అధికారులు ప్రభుత్వానికి సరెండరు చేయాల్సి వున్నా చేయలేదు.
- 03-04లో ఆస్తులూ పెరిగాయి; అప్పులూ పెరిగాయి. ఆస్తుల కన్నా అప్పులు ఎక్కువ పెరిగాయి. ఆస్తులు రు. 6289 కోట్లు పెరిగితే, అప్పులు రు. 10059 కోట్లకు పెరిగాయి.
- 1951లో మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభించిన నాటి నుంచి రాష్ట్ర ప్రభుత్వం 100 నీటిపారుదల ప్రాజెక్టుల (21 భారీ, 79 మధ్య తరహా) నిర్మాణం చేపట్టింది. ఇవి పూర్తి అయితే 92.62 లక్షల ఎకరాలు సాగులోకి వస్తాయి. జూన్ 2004 నాటికి 10 భారీ, 14 మధ్య తరహా మొత్తం 24 ప్రాజెక్టులు మాత్రమే పూర్తి అయ్యాయి. మిగతా వాటిలో 17 ప్రాజెక్టులు రెండు దశాబ్దాల నుంచి నిర్మిస్తూనే వున్నారు. ఇందులో రు. 2529 కోట్లు ఖర్చు చేసిన 11 ప్రాజెక్టుల కింద భూములకు ఒకచుక్క నీరు కూడా అందలేదు. నిధుల్లేక పోవటం, పక్క రాష్ట్రాల అనుమతులు సంపాదించటంలో జాప్యం, అడవి, కేంద్ర వాటర్ కమీషన్ అనుమతులు లభించకపోవటం, భూమిసేకరణ ఆలస్యం-ఇవి కొన్ని కారణాలు. ప్రాజెక్టులు నిర్మాణంలో ఆలస్యం కారణంగా వాటి ఖర్చు అదనంగా 583 శాతం పెరిగింది.
- స్థానిక సంస్థలు, విశ్వవిద్యాలయాలు, విద్యా సంస్థలు, ట్రాన్స్‌కో, హౌసింగ్ కార్పొరేషన్ లాంటి సంస్థలకు ప్రభుత్వ సహాయం 99-00లో 39.1 శాతం నుంచి 03-04లో 35.8 శాతానికి తగ్గింది.
- సామాజిక సేవల ఖర్చులో విద్య, ఆరోగ్యం, మంచినీరు, పారిశుధ్యం, గృహనిర్మాణం కోసం చేసిన ఖర్చు పైన ఉదహరించిన కాలంలో 67 శాతం నుంచి 72.2 శాతం వరకు పెరిగి 03-04లో 66.5 శాతానికి పడిపోయింది.
- ఎన్.టి. రామారావు హయాంలో రు. 1100 కోట్లు సబ్సిడీ ఇచ్చి పేదలకు రెండు రూపాయలకే కిలోబియ్యం సరఫరా చేసి పేదరికం మీద కొంతమేరకైనా దెబ్బ తీస్తే, చంద్రబాబు హయాంలో సబ్సిడీ 03-04లో కేవలం రు. 341 కోట్లకు ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు తగ్గించి, బియ్యంధర పెంచి పేదల భారాన్ని పెంచారు. సబ్సిడీలు ఇవ్వటం గురించి పెద్దగా లొల్లి చేస్తున్నారు గాని, మొత్తం ఖర్చులో అన్ని రకాల సబ్సిడీల కోసం చేసే ఖర్చు ఆరుశాతం మాత్రమే. ఈ సందర్భంలో పేర్కొనాల్సిన, తెలుసు కోవాల్సిన విషయ మేమిటంటే గత సంవత్సరం ఎగుమతులు చేసే వారికి ప్రభుత్వం ప్రోత్సాహకాలు, మినహాయింపుల పేరుతో (ఇవి సబ్సిడీకి మారుపేర్లు) 40 వేల కోట్ల రూపాయలు ఇచ్చిందని హిందూ 'బిజినెస్ లైన్' పత్రిక వార్త.

ఇవన్నీ కాగ్ నివేదిక వెల్లడించిన కొన్ని వాస్తవాలు మాత్రమే. ఈ కశ్మలాన్నుంచి రాష్ట్రాన్ని బయటపడ వేయాల్సిన బాధ్యత ఆర్థికమంత్రి రోశయ్య మెడకు చుట్టుకొంది. ఆయన బయట పడవేయలేకపోతే, మనమూ మన సమస్యలనుంచి బయట పడలేం. అందుచేత ఆయన విఫలం కాకూడదని కోరుకొందాం. ❑

## వచ్చే సంచికలో ...

- ✻ ఏలేరు కుంభకోణం విచారణ
- ✻ వ్యాట్ విధానంపై సమీక్ష
- ✻ కొత్త పేటెంట్ చట్టం - దాని పర్యవసనాలు

# ప్రజాధన వినియోగంపై నియంత్రణ- రాష్ట్రంలో ద్రవ్య వినియోగంపై పరిశీలన

-ఎన్. శ్రీదేవి

**నానాటికీ తీసికట్టవుతున్న రాష్ట్ర ద్రవ్య పరిస్థితిని గుర్తెరిగి, తగినంతగా సవరణలను చేపట్టాల్సి వుంది. రాష్ట్ర ద్రవ్యపరిస్థితిని మెరుగు పర్చేందుకు ప్రస్తుత ప్రభుత్వం అనుసరిస్తున్న విధాన లోపాలను సరిచేయడమే కాకుండా, రాజ్యాంగ పరమైన అవరోధాలను అధిగమించడం సైతం అనివార్యం.**

## సందర్భం:

జాతీయస్థాయి ఆర్థిక సంక్షోభ పరిస్థితుల్లో 'రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక పరిస్థితి' అన్న విషయం ప్రాముఖ్యతను సంతరించుకుంటుంది. రాష్ట్రాల ద్రవ్యపరిస్థితి 1990 దశకం ఉత్తరార్థ భాగం నుంచి పూర్తిగా దిగజారడం ప్రారంభించింది. అప్పుడే ఈ ద్రవ్య విధాన పరిశీలనకు భారత రిజర్వుబ్యాంకు ద్రవ్య బాధ్యత నమూనా చట్టాన్ని రాష్ట్రస్థాయి ఆర్థిక కార్యదర్శుల ఆధ్వర్యాన నియమించింది కూడా. అయితే ఈ సంక్షోభం ఒకేసారి నెలకొన్నదా అన్న ప్రశ్న తలెత్తక మానదు. అసలింత వరకూ ఈ ప్రజాధన వినియోగంపై ఎటువంటి అదుపును, నియంత్రణను చేపట్టలేదా అన్న ప్రశ్న సైతం తలెత్తుతుంది. అయితే ఈ రెండు ప్రశ్నలకు సమాధానం 'లేదు' అన్నదే. వాస్తవంగా అయితే మనదేశంలో ప్రజాధన వినియోగంపై మూడంచెల నియంత్రణలు అమల్లో వున్నాయి. అవి 1. సభాస్థాయి నియంత్రణ. 2. పాలనా నియంత్రణ. 3. ఆడిట్ నియంత్రణ.

బడ్జెట్‌లో భిన్నస్థాయిల్లో ప్రజాధనంపై నియంత్రణ వుంటుంది. 1. బడ్జెట్ రూపకల్పనస్థాయిలో 2. బడ్జెట్ సభామోదు పొందే స్థాయిలో 3. ఆమోదిత బడ్జెట్‌లో నిధుల కేటాయింపు, వినియోగ సందర్భాల్లో 4. అకౌంట్ల ఆడిట్, పరిశీలనా నివేదికలను ఎకౌంటెంట్ జనరల్ పరిశీలించే సందర్భంలో. కాకుండా, కడపటిగా ప్రజాధన వినియోగాన్ని పబిక్ అకౌంట్స్ కమిటీ, ఎస్టిమేట్స్ కమిటీ ఆపై సభా సంఘం పరిశీలించాల్సి వుంటుంది. ఈ నియంత్రణా విధానాలకు తోడుగా, ద్రవ్య బాధ్యతా బిల్లు ప్రకారం సమీక్షించే వెసులుబాటూ వుంది. కాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ బిల్లును చేపట్టలేదు. ఈ సమీక్ష ముఖ్యోద్దేశ్యం సైద్ధాంతిక, ఆచరణా విధానరీత్యా ప్రజాధన వినియోగాన్ని పరిశీలించడం. రాజే లేడు కాబట్టి కథే లేదు. అసలా బిల్లే లేదు. ఇంక సిద్ధాంతం, ఆచరణా ఇంకెక్కడిది? ఇంక మిగిలిన గణాంక వివరణలు లభ్యమయ్యే అవకాశాలు కాగ్ నివేదికలు, సభా కమిటీల నివేదికలు. ప్రస్తుత అధ్యయనానికి గత ఆరేళ్ళ కాలాన్ని ప్రమాణంగా తీసుకొంటున్నాం.

మొత్తం అధ్యయనాన్ని నాలుగు భాగాలుగా విభజించుకుందాం. రెండో భాగంలో బడ్జెట్ తయారీ, ప్రజాధన రాజ్యాంగపర పరిశీలనలను చర్చిద్దాం. మూడో భాగంలో ఆడిట్ నివేదికల ఆధారంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ద్రవ్య వినియోగ అవకాశాన్ని పరిశీలిద్దాం. నాలుగో భాగంలో ముక్తాయింపు.

## రాష్ట్ర బడ్జెట్ - రాజ్యాంగ అవరోధాలు

బడ్జెట్ తయారీలో ద్రవ్య వినియోగ నియంత్రణ పురుడు పోసుకుంటుంది. ప్రభుత్వాధికారులు బడ్జెట్ తయారీ సన్నాహాల్లోనే విధానం, పాలసీ, ప్రణాళిక, పథకం మొదలైన మౌలిక అంశాలను ప్రాతిపదికగా తీసుకుంటారు. ప్రభుత్వ బడ్జెట్ తయారీ అంటేనే ఆదాయ వనరుల అంచనా. ఇందుకనువుగా ప్రభుత్వ సామాజిక ఆర్థిక లక్ష్యాలను అధిగమించే రీతిన 'వ్యయ ప్రణాళిక' ను రూపొందించడం. వివిధ పద్దుల వ్యయ అంచనాలు వేసే అధికార్లు అంటే లక్ష్యసాధనకు అవసరమైన ద్రవ్య అంచనాలను గత సంవత్సరాల్లో వాస్తవ వ్యయాలను పరిగణనలోకి తీసుకుంటూ ప్రస్తుత (నడుస్తున్న) సంవత్సరంలో వ్యయ ధోరణులను సరిపోలుస్తూ రానున్న కాలానికి వ్యయ అంచనాలను రూపొందిస్తారు. ఇక్కడ అత్యంత ఆవశ్యకమైనది నిర్దిష్టత. అయితే ఈ అంచనాలు ఎప్పుడూ నూరుపాళ్లు నిర్దిష్టంగా వుండవనేది జగమెరిగిన వాస్తవం. అయితే ఒకటిమాత్రం అవసరం, ఈ అంచనాలు సాధ్యమైనంతగా అవసరాలకు తగ్గంత వాస్తవంగా వుండాలి.

ఇక, సభా నియంత్రణ. ఇది విధాన రూపకల్పనలోనే అంటే వార్షిక ప్రణాళికను ఆమోదించే సమయంలోనే ఆవశ్యకమౌతుంది. రాష్ట్ర శాసన మండలి డిమాండ్లకు గ్రాంట్లను ఆమోదించేయగానే పనైపోదు. కేటాయింపుల నుంచి మొత్తాలను ఉపసంహరించు

కునేందుకు, సంబంధిత వినియోగాధికారం ఇచ్చే బిల్లు 'చట్టం' గా రూపొంది రాష్ట్ర గవర్నర్ ఆమోదాన్ని పొందాల్సి వుంటుంది. వార్షిక బడ్జెట్ సభా ఆమోదం పొందిన మీదట, ఆదాయ వనరుల సమీకరణ బడ్జెట్ కేటాయింపుల కనుగుణంగా వివిధ పద్దుల వ్యయాలు అమల్లోకి వస్తాయి.

అకౌంటెంట్ జనరల్ అనే స్వతంత్రాధికారి ప్రభుత్వ వాస్తవ ఆర్థిక విధానాన్ని సభామోదం పొందిన మీదట, పరిశీలించి శాసనబద్ధ ఏర్పాట్లు, నియమ నిబంధనలను సరిచూసి ఆదేశాలను జారీ చేయడం జరుగుతుంది. ఆమోదిత విధాన అమలుకు ఈ పరిశీలనా క్రమం హామీనిస్తుంది. ఈ నియంత్రణ ఆర్టికల్ 266 ప్రకారం రాజ్యాంగ బద్ధమైనదే. రాష్ట్ర సంచితనిధి నుంచి రాజ్యాంగ నిబంధనలను అతిక్రమించి ద్రవ్య వినియోగం చేపట్టే వీలులేదు. అకౌంటెంట్ జనరల్ ఈ కేటాయింపులను సరిచూసి నివేదికను గవర్నర్‌కు ప్రతిపాదిస్తారు. పబ్లిక్ అకౌంట్స్ కమిటీ, పబ్లిక్ అండర్‌టేకింగ్స్ కమిటీలు నివేదికలను పరిశీలించి అవసరమైన సూచనలను చేపట్టి, నివేదికలను శాసనసభకు ప్రతిపాదిస్తాయి.

**ప్రభుత్వ పాలనలో అవకతవకలు**

ఆదాయ చెల్లింపులు: ఆదాయ చెల్లింపుల్లో అవకతవకలు ఒకేసారి పరిష్కారం కావు. అకౌంటెంట్ జనరల్ పరిశీలనా నివేదికలను ఆయా శాఖాధికారులకు పంపిస్తారు. వీరితో పాటు ఆపై అధికారులకు ఈ నివేదికలను పంపి, పరిశీలనా సూచనలను అమలు పర్చమని కోరతారు. అయితే వాస్తవ ఆచరణలో ఈ పరిశీలనా నివేదికలను అమలు పర్చకుండా 'తాత్సారం' చేయడం జరుగుతుంది. ఈ తాత్సార ఉపేక్ష కాలానుగతంగా పెరగడం సైతం మనం గమనించ వచ్చు. ఈ 'తాత్సారం' జూన్ 2001 నాటివరకూ పరిమితంగా వుండగా, ఆ తరువాతి కాలంలో పరిశీలనా నివేదికలకన్నా అధికంగా ఉండటమే కాదు. తాత్సారానికి గురైన మొత్తాలు సైతం హెచ్చు స్థాయిలో వుండటం గమనార్హం.

అమ్మకం పన్ను, భూమి శిస్తు, గనులు-ఖనిజశాఖ, నీటిపారుదల-ఆయకట్టు, ఆర్థిక ప్రణాళికా శాఖల్లో సుమారు రు. 5246 కోట్ల మేరకు తాత్సారానికి గురైన అనుభవం మనముందు వుంది.

సాధారణంగా, పన్నుల సేకరణలో పాలనా ప్రభుత్వం అనుసరిస్తున్న తప్పుడు ధోరణులు అసాధారణ రాయితీల ఆమోదం పన్ను రేట్లలో అసాధారణ ధోరణులు, అసాధారణ అపరాధ రుసుముల వసూళ్ళు వంటి అవకతవకలు చోటు చేసుకుంటుంటాయి. ఈ అవకతవకల ఫలితంగా ప్రభుత్వ ఖజానాకు అవరోధాలు ఏర్పడతాయి. పట్టిక 1 లో పోగుపడ్డ వసూళ్ళు ఐదేళ్ళకు పైబడి

**పట్టిక-1**

**సేకరించని ఆదాయం (బకాయి)**

(కోట్ల రూ)

| | మొత్తం సేకరించిన ఆదాయం | 5 సం.కన్నా ఎక్కువ బకాయి |
|---|---|---|
| 1998 | 1302.4 | 536.5 |
| 1999 | 1755.9 | 449.9 |
| 2000 | 2264.7 | 1007.9 |
| 2001 | 2666.4 | 1469.6 |
| 2002 | 2230.6 | 1134.3 |
| 2003 | 3020.8 | 1320.8 |

బకాయిలుగా నిల్చాయి. రు. 2230 కోట్లకు చేరుకుంది. ఈ మొత్తం ఐదేళ్ళకు పైబడి బకాయిలుగా వుంది. ఈ మొత్తం, సుమారు 51 శాతంగా నమోదయింది. 2002-03 వ సంవత్సరానికి వచ్చే సరికి ఈ బకాయిలు రు. 3020 కోట్లయి కూర్చుంది. ఇదే 44 శాతం బకాయిలుగా గత ఐదేళ్ళ బకాయిలను అధిగమించడం గమనార్హం. ఈ ధోరణి ప్రభుత్వ ఖజానాకు గండిపర్చడమే కాకుండా, అవసర వ్యయాలను ప్రభుత్వం ఎదుర్కోలేని పరిస్థితులకు నెట్టేసింది. బకాయిల వివరణ పన్నుల వారీగా మనం పట్టిక-2 లో చూడవచ్చు. 79 నుంచి 89 శాతం మేరకు అమ్మకం పన్ను బకాయిలు గత రెండేళ్లలో వసూళ్ళకు ఉపక్రమించి గత సంవత్సరాల పోలికలో గణనీయ పెరుగుదలను నమోదు చేసింది.

**పట్టిక-2**

**మొత్తం పన్ను బకాయిలలో సేకరించని బకాయిల శాతం**

(శాతం)

| పన్నుఆదాయం | 1998 | 1999 | 2000 | 2001 | 2002 | 2003 |
|---|---|---|---|---|---|---|
| అమ్మకం పన్ను | 65.5 | 68.4 | 66.7 | 65.2 | 88.8 | 79.3 |
| ఎక్సైజ్ | 5.0 | 3.7 | 2.8 | 2.4 | 2.9 | 2.2 |
| భూమిశిస్తు | 0.0 | 0.0 | 0.0 | 6.8 | 0.0 | - |
| వాహనాలపై పన్ను | 0.6 | 0.4 | 0.4 | 0.3 | 0.2 | 13.0 |
| స్టాంపుడ్యూటీ, రిజిస్ట్రేషన్‌పన్ను | 0.2 | 0.2 | 1.3 | 1.3 | 1.6 | 1.2 |
| విద్యుత్ పన్నులు,సుంకాలు | 28.6 | 27.3 | 28.8 | 24.0 | 1.0 | 0.3 |
| ఇతర పన్నులు సుంకాలు | | | | | 5.5 | 4.0 |
| మొత్తం బకాయిలు | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

ప్రభుత్వ నిర్వహణ ధోరణులను-అవకతవకలను, బకాయిల వివరాలను ఆడిట్ నివేదికలో అకౌంటెంట్ ఎత్తి చూపినప్పటికీ, ప్రభుత్వం అతికొద్ది సూచనలనే పరిగణనలోకి తీసుకుంది. (పట్టిక-3) చివరికి ప్రభుత్వం ఆమోదించిన అవకతవకల మొత్తాలను సైతం పూర్తిగా పరిపూర్తి చేయలేక పోయింది. అవకతవకలను సరి చేసుకోలేని స్థితి వనరుల అవరోధానికి దారితీసిన వైనంను సూచిస్తుంది. ఫలితంగా వనరుల నిరోధంకు

తావిచ్చి ప్రభుత్వ సజావు మనుగడకు, తద్వారా లక్ష్య సాధనకు అడ్డంకిగా మారింది.

బకాయిలు పేరుకు పోవడానికి ప్రధానంగా ప్రభుత్వ శాఖా పరంగా కాని, న్యాయ స్థానాల జోక్యంతో కానీ స్టే ఆర్డర్లు పొందడం లేదా ఆదాయ సమీకరణ చట్ట లొసుగులు లేదా ఇతరత్రా కారణంగా కానీ వుండొచ్చు. ఏమైనాగానీ ప్రభుత్వ పాలనాధికారులు ఈ అవకతవకలను అధిగమించగలిగితే ప్రభుత్వ ఖజానాను పరిపుష్టం చేయడమే కాకుండా, ప్రభుత్వ ప్రాధాన్యతలను సానుకూలం చేసుకునే వెసులుబాటు కలుగుతుంది. ఇందుకు ఆదాయ పాలనా ధోరణులను మెరుగుపర్చుకోవడం అనివార్యం.

## ప్రభుత్వ వ్యయం

ప్రభుత్వ పాలనా తీరులోని అవకతవకలే కాకుండా ప్రభుత్వ వ్యయ ధోరణుల్లో సైతం అవకతవకలు కోకొల్లలు. ప్రభుత్వ

పట్టిక-3

బడ్జెట్ కేటాయింపులు, సప్లిమెంటరీ కేటాయింపులు

(కోట్ల రూ)

సప్లిమెంటరీ కేటాయింపులు అనవసరమైన కేసులు

| | కేసుల సంఖ్య | బడ్జెట్ కేటాయింపు | సప్లిమెంటరీ కేటాయింపు | మొత్తం కేటాయింపు | వాస్తవంగా ఖర్చు | ఆదా/ అదనపు | (కోట్ల రూ) మొత్తం కేటాయింపులో శాతం |
|---|---|---|---|---|---|---|---|
| 1997-98 | 26 | 4582.18 | 317.27 | 4899.45 | 4173.18 | 726.27 | 14.8 |
| 1998-99 | 26 | 7619.47 | 276.66 | 7896.13 | 7149.00 | 747.13 | 9.5 |
| 1999-2000 | 30 | 6880.67 | 439.20 | 7319.87 | 5995.81 | 1324.06 | 18.1 |
| 2000-01 | | 2126.14 | 55.02 | 2181.16 | 1904.58 | 276.58 | 12.7 |
| 2001-02 | | 8901.70 | 221.69 | 9123.39 | 7914.39 | 1209.00 | 13.3 |
| 2002-03 | 34 | 19473.52 | 501.13 | 19974.65 | 17948.66 | 2025.99 | 10.1 |

అవసరమైన దానికన్నా ఎక్కువ సప్లిమెంటరీ కేసులు

| | కేసుల సంఖ్య | బడ్జెట్ కేటాయింపు | సప్లిమెంటరీ కేటాయింపు | మొత్తం కేటాయింపు | వాస్తవంగా ఖర్చు | ఆదా/ అదనపు | (కోట్ల రూ) మొత్తం కేటాయింపులో శాతం |
|---|---|---|---|---|---|---|---|
| 1997-98 | 21 | 4731.09 | 3543.95 | 8275.04 | 7677.18 | 597.86 | 7.2 |
| 1998-99 | 25 | 6267.18 | 6963.08 | 13230.26 | 12526.47 | 703.79 | 5.3 |
| 1999-2000 | 29 | 6812.38 | 3030.68 | 9843.06 | 8734.31 | 1108.75 | 11.3 |
| 2000-01 | 6 | 4323.40 | 7410.28 | 11733.68 | 11430.76 | 302.92 | 2.6 |
| 2001-02 | 13 | 7314.52 | 9337.16 | 16651.68 | 16501.03 | 150.65 | 0.9 |
| 2002-03 | 21 | 1239.00 | 1410.48 | 2649.48 | 2392.86 | 256.62 | 9.7 |

సప్లిమెంటరీ కేటాయింపులుగా కూడా చాలనివి

| | కేసుల సంఖ్య | బడ్జెట్ కేటాయింపు | సప్లిమెంటరీ కేటాయింపు | మొత్తం కేటాయింపు | వాస్తవంగా ఖర్చు | ఆదా/ అదనపు | (కోట్ల రూ) మొత్తం కేటాయింపులో శాతం |
|---|---|---|---|---|---|---|---|
| 1997-98 | 17 | 4805.14 | 1561.24 | 6366.38 | 6724.46 | 358.08 | 5.6 |
| 1998-99 | 21 | 5301.50 | 458.30 | 5759.80 | 5972.69 | 212.89 | 3.7 |
| 1999-2000 | 9 | 2765.20 | 5446.38 | 8221.58 | 8994.68 | 773.10 | 9.4 |
| 2000-01 | 4 | 1735.55 | 96.46 | 1832.01 | 1975.31 | 143.30 | 7.8 |
| 2001-02 | 12 | 3158.70 | 680.30 | 3839.00 | 4211.88 | 372.88 | 9.7 |
| 2002-03 | 8 | 6495.15 | 1833.69 | 8328.84 | 8842.75 | 513.91 | 6.2 |

వినియోగాన్ని ఆడిట్ ప్రక్రియ ద్వారా చట్ట, నియమ నిబంధనల మేరకు జరిగాయా? లేదా ? అన్నది నిర్ధారించడం జరుగుతుంది.

సాధారణంగా ప్రభుత్వ వ్యయ ధోరణుల్లో చోటు చేసుకునే ధోరణులు:

1. సంభావ్యతా నిధుల్లోనుంచి తీసుకున్న మొత్తాలు తిరిగి భర్తీ కాకపోవడం.
2. అంచనా సేకరణలకు, వాస్తవ సేకరణలకు తీవ్రస్థాయిలో తేడాలు.
3. మిగులు మొత్తాలు, పొదుపు మొత్తాలకు సంబంధించిన వివరణలు సమగ్రంగా లేకపోవడం.
4. కోశాగార నియంత్రణ ఉపశమనంగా ఆమోదించిన మొత్తాలను అదనపు అంచనాల్లో చేర్చక పోవడం.
5. అవసరానికి ముందే మొత్తాలను తీసుకోవడం. ఆర్థిక నిబంధనల మేరకు అరూప వినియోగ బిల్లులు ప్రభుత్వ ప్రత్యేక మంజూరి ఆదేశాల మేరకే తీసుకోవలసి వుంటుంది. ఈ అరూప వినియోగ బిల్లులను నెలరోజుల ముందుగా తీసుకున్నా, తదనంతరపు అరూప వినియోగ బిల్లును కోశాగారానికి సమర్పించడానికి ముందుగా సమర్పించాల్సి వుంటుంది, నిబంధనల ఏమరకు కానీ..
6. వ్యక్తిగత డిపాజిట్ ఖాతాలను (సమాధాన పర్చుకోలేని ఖాతాలను) కోశాగారంతో ముడిపెట్టడం తాత్కాలిక నిధుల మళ్ళింపుపై సరైన నిఘా లేక, పథక నిధులు సక్రమ వినియోగం కాకపోవడం వంటివి.

సాధారణంగా దొర్లే అవకతవకల్లో కొన్ని మాత్రమే ఇవి.

వినియోగ అధికారం ఇచ్చే ఖాతాల నుండి అదనపు గ్రాంటు, వాస్తవ గ్రాంటులో ప్రాధాన్యతగలదిగా వుంటుంది. 2002-03 నాటి వరకూ చేసిన అధ్యయనం, ఈ అదనపు గ్రాంటు అనివార్యమని స్పష్టం చేస్తూ వుంది. వ్యయం కాని మొత్తాలు అంటే అనివార్యంగా వాయిదా పడ్డ పనులు, పాలనా వైఫల్యం రీత్యా మంజూరు కాని మొత్తాలే కాకుండా అవసరానికి మించి జారీ చేసిన మొత్తాలు కూడా వుంటాయి.

వినియోగ వ్యయం శాసనసభ నియంత్రించినప్పటికీ ప్రభుత్వం అధిక మొత్తాన్ని పొందడం జరుగుతుంది. (పట్టిక-4) ఈ తరహా 1997-98 నుంచి 2001-02 ల మధ్య అధ్యయనంలో గమనించవచ్చు.

**పట్టిక-4**

**కేటాయింపుకన్నా 10 శాతం ఎక్కువగా ఆదాచేస్తూ వచ్చిన కేసులు**

| | 1995-96 | 1996-97 | 1997-98 | 1998-99 | 1999-2000 | 2000-01 |
|---|---|---|---|---|---|---|
| పబ్లిక్ వర్క్స్ (సివి) | - | - | 0.0 | 21.0 | 10.0 | 37.3 |
| పాఠశాలవిద్య (సివి) | - | - | 0.0 | 74.7 | 99.0 | 95.2 |
| మందులు/ఆరోగ్యసేవలు (ఎల్‌వి) | - | - | 0.0 | 40.9 | 95.6 | 50.3 |
| కార్మికులు/ఉద్యోగిత (ఆర్‌వి) | - | - | 28.5 | 14.9 | 28.8 | 11.1 |
| సామాజిక సంక్షేమం (ఆర్‌వి) | 100.0 | 86.8 | 94.0 | 99.6 | 98.9 | 65.4 |
| సామాజిక సంక్షేమం (సివి) | 49.6 | 39.6 | 59.5 | 36.7 | 84.9 | 58.3 |
| గిరిజన ఉపప్రణాళిక (ఆర్‌వి) | 53.5 | 26.1 | 61.5 . | 29.4 | 50.6 | 51.0 |
| గిరిజన ఉపప్రణాళిక (ఎల్‌వి) | - | - | 0.0 | 99.7 | 100.0 | 36.3 |
| స్త్రీ, శిశుసంక్షేమం (ఆర్‌వి) | - | 30.3 | 30.8 | 34.5 | 55.0 | 33.0 |
| వ్యవసాయం (ఆర్‌వి) | - | - | 0.0 | 21.7 | 33.1 | 10.9 |
| మత్స్యశాఖ (ఆర్‌వి) | 13.5 | 19.0 | 17.3 | 21.3 | 31.8 | 15.1 |
| సహకారం (సివి) | - | - | 0.0 | 53.3 | 56.4 | 54.9 |
| నీటిపారుదల (సివి) | - | - | 36.1 | 40.6 | 12.1 | 35.4 |
| విద్యుచ్ఛక్తి (సివి) | - | 48.8 | 36.6 | 28.5 | 14.8 | 10.1 |
| విద్యుచ్ఛక్తి (సివి) | - | - | 39.5 | 78.8 | 66.0 | 40.6 |
| పరిశ్రమలు (ఎల్‌వి) | - | - | 0.0 | 36.5 | 16.3 | 45.4 |
| గృహనిర్మాణం (ఎల్‌వి) | - | - | 0.0 | 23.8 | 34.1 | 14.8 |
| ప్రభుత్వోద్యోగులకు రుణాలు తదితర రుణాలు | - | 55.8 | 43.6 | 11.7 | 48.9 | 0.0 |

ఆర్‌వి: రెవెన్యూ వోటెడ్; సివి (పెట్టుబడి వోటెడ్), ఎల్‌వి (రుణాలువోటెడ్)

అదనపు వినియోగ చట్టం అనివార్యమైన వక్షంలోనే అవకతకవలను నివారించేందుకు తగు ప్రయత్నం జరిగేది. కొన్ని నిర్దిష్ట కేసుల్లో ఆర్థిక సంవత్సరాల్లో ఎ) అనవసరం అని భావించడం ద్వారా, బి) పది లక్షలను మించి సరిపోని మొత్తాలైన వేళ, సి) 10 లక్షలను మించి అవసరమైనప్పుడు వినియోగ అంచనాల కన్నా వాస్తవ వ్యయం తక్కువైన పక్షంలో ప్రభుత్వ దర్యాప్తు జరిపి, ప్రత్యామ్నాయ చర్యలను చేపట్టాల్సి వుంటుంది.

మనం గమనించాల్సిన అంశం ఏతరహా వ్యవస్థాగత ఏర్పాట్లు లేకుండానే ద్రవ్య వినియోగాన్ని చేపట్టడం, బడ్జెట్‌కు భిన్నంగా, వాస్తవ అంచనాల ద్వారా లేదా అదనపు డిమాండ్ల ద్వారా అయినా లేదా పునః వినియోగ ఆదేశాల ద్వారానైనా చేపట్టడం జరుగుతుంది.

మరికొన్ని కేసుల్లో వదిలేసుకున్న మొత్తాలు వాస్తవ పొదుపు మొత్తాలకన్నా అధికంగా వుంటాయి. కేటాయించిన మొత్తాలకన్న అదనపు వ్యయం చేసి, వదిలేసుకోవడం తరహా చర్యలన్నీ సరిపోని బడ్జెటరీ నియంత్రణనే సూచిస్తున్నాయి. ఈ తరహా చర్వితచర్వణంగా దొర్లుతున్న అవకతవకల నియంత్రణకు రాష్ట్ర బడ్జెట్ మాన్యువల్‌లో సూచించిన జాగ్రత్తలను అన్ని శాఖలూ పాటిస్తే సరిపోతుంది.

ఆర్థిక సంవత్సరం చివరి మూడునెలల కాలంలో మరో తరహా ధోరణి.. వ్యయాల (ఒత్తిడి) వరద. పట్టిక 5 ప్రభుత్వ ప్రణాళికలను సక్రమంగా చేపట్టని కారణంగా, రాజీలేని వ్యయాన్ని శాఖల రీత్యా

**పట్టిక-5**

**మార్చినెలలో ఆదరా బాదరా ఖర్చు**

(కోట్ల రూ)

| | జూన్ అఖరుకు | సెప్టెంబర్ అఖరుకు | డిసెంబర్ అఖరుకు | మార్చి అఖరుకు | మొత్తం ఖర్చు | మార్చిలో |
|---|---|---|---|---|---|---|
| 1997-98 | N.A | N.A | N.A | N.A | 14174.3 | 3686.9 |
| | | | | | (100.0) | (26.0) |
| 1998-98 | 3423.4 | 4119.1 | 3433.1 | 9385.4 | 20361.1 | 6707.0 |
| | (16.8) | (20.2) | (16.9) | (46.1) | (100.0) | (32.9) |
| 1999-00 | 3434.9 | 4473.4 | 5484.9 | 8583.7 | 21976.9 | 3316.3 |
| | (15.6) | (20.4) | (25.0) | (39.1) | (100.0) | (15.1) |
| 2000-01 | 3951.7 | 5095.7 | 45571.1 | 12189.4 | 25793.9 | 8693.4 |
| | (15.3) | (19.8) | (17.7) | (47.3) | (100.0) | (33.7) |
| 2001-02 | 4259.5 | 6806.3 | 5787.5 | 10964.0 | 27817.3 | 6172.1 |
| | (15.3) | (24.5) | (20.8) | (39.4) | (100.0) | (22.2) |
| 2002-03 | 4327.5 | 6777.9 | 7492.4 | 11255.2 | 29853.0 | 6645.2 |
| | (14.5) | (22.7) | (25.1) | (37.7) | (100.0) | (22.3) |

(బ్రాకెట్లలో అంకెలు మొత్తంలో శాతం)

**పట్టిక-6**

**చెల్లించాల్సిన రుణం**

| | మార్కెట్ రుణాలు | కేంద్రం రుణాలు | స్వతంత్ర సంస్థల ద్వారా రుణాలు | చెల్లించాల్సిన మొత్తంరుణాలు | చెల్లించాల్సిన రుణం మీద సగటు వడ్డీ |
|---|---|---|---|---|---|
| 80-81 | 15.22 | 81.26 | 3.52 | 100.00 | |
| 81-82 | 16.21 | 79.75 | 4.04 | 100.00 | 5.79 |
| 82-83 | 16.77 | 78.74 | 4.39 | 100.00 | 6.08 |
| 83-84 | 18.06 | 76.08 | 5.86 | 100.00 | 5.92 |
| 84-85 | 18.07 | 72.09 | 9.84 | 100.00 | 6.53 |
| 85-86 | 19.67 | 77.55 | 2.78 | 100.00 | 6.88 |
| 86-87 | 20.97 | 76.26 | 2.77 | 100.00 | 9.03 |
| 87-88 | 22.66 | 74.55 | 2.79 | 100.00 | 8.49 |
| 89-89 | 24.51 | 72.81 | 2.68 | 100.00 | 9.06 |
| 89-90 | 25.73 | 71.57 | 2.70 | 100.00 | 10.17 |
| 90-91 | 26.06 | 71.31 | 2.63 | 100.00 | 11.18 |
| 91-92 | 26.98 | 70.49 | 2.53 | 100.00 | 11.35 |
| 92-93 | 27.29 | 70.27 | 2.45 | 100.00 | 11.57 |
| 93-94 | 26.21 | 71.25 | 2.54 | 100.00 | 12.31 |
| 94-95 | 26.10 | 71.48 | 2.43 | 100.00 | 12.62 |
| 95-96 | 25.92 | 71.33 | 2.75 | 100.00 | 13.10 |
| 96-97 | 26.31 | 68.18 | 5.52 | 100.00 | 13.56 |
| 97-98 | 26.39 | 67.80 | 5.81 | 100.00 | 14.00 |
| 98-99 | 28.23 | 65.18 | 6.58 | 100.00 | 14.86 |
| 99-00 | 31.00 | 61.76 | 7.24 | 100.00 | 14.78 |
| 2000-01 | 30.22 | 54.59 | 15.19 | 100.00 | 15.50 |
| 2001-02 | 30.77 | 52.93 | 16.37 | 100.00 | 15.46 |
| 2002-03 (స.అం) | 33.75 | 48.80 | 17.46 | 100.00 | 16.84 |
| 2003-04 (బ.అం) | 34.19 | 48.99 | 16.81 | 100.00 | 16.82 |
| కాంపౌండ్ అభివృద్ధి రేటు | | | | | |
| 1980-90 | 20.93 | 12.69 | 6.69 | 14.05 | |
| 1990-2001 | 18.49 | | 15.76 | 36.83 | 17.49 |

నడుస్తున్న సంవత్సరం 5కితం సంవత్సరం సగటు

చూపడం ముందుగా అంచనా వేసిన పొదుపు మొత్తాలను వదలకపోవడం, పైగా ఆర్థిక సంవత్సర ముగింపు రోజున వదులుకోవడం వంటి చర్యలు శాఖల బాధ్యతా రాహిత్యానికి, బడ్జెట్ ప్రతిపాదనలను ఉపేక్షించిన ధోరణులకు ఉదహరణలుగా నిలుస్తాయి. బడ్జెట్ కేటాయింపుల్లేకుండా కూడా వ్యయంను చూపే ధోరణులూ వున్నాయి.

శాసనసభకు సమర్పించిన ఆడిట్ నివేదికల్లో కొన్ని శాఖలు తాము చేపట్టిన చర్యల గురించి వివరణలను సైతం పొందుపర్చని పరిస్థితి వుంది. తాజా ఆడిట్ నివేదికల్లో ప్రజా పద్దుల కమిటీ ఈ విషయమై తీవ్ర విచారాన్ని వ్యక్తం చేసింది.

(మిగతాది 33వ పేజీలో)

# మిర్చి ఘాటు వదలి బతుకు తీపి దారి వెతుకుదాం

-వి. శ్రీహరి

మిర్చి రైతులను గట్టెక్కించడం సాధ్యం కాదని ముఖ్యమంత్రి తేల్చి చెప్పేశారు. రాజకీయ పార్టీల వివాదాలను సజీవంగా వుంచేందుకు మరొక అంశం దొరికింది. వాళ్ల ప్రయోజనాలకు అది సరిపోతుంది. కాని రైతాంగం పరిస్థితి ఏమిటి?

మిర్చి ఎగుమతికి అవకాశాలు తగ్గాయి. కాని దాచి పెట్టేందుకు 'కోల్డ్ స్టోరేజ్'లు లేవు. కొని దాచేంత ఆర్థిక శక్తి ప్రభుత్వానికి లేదు. మార్కెట్ పట్టుకోగల వారు ప్రైవేట్ వ్యాపారులు. దాచుకునే మార్గాలు వాళ్లకే తెలుసు. ప్రభుత్వానికి కొరవైన నిధులు ప్రైవేట్ వ్యాపారుల వద్ద వుంటాయి! ఎందువల్ల? రాష్ట్ర ప్రభుత్వం మీద బ్యాంకులకు నమ్మకం లేదు. వ్యాపారుల మీద అపారమైన ప్రేమగదా? ఫుడ్ అడ్వాన్సులు వారికి బాగా అందుబాటులో వుంటాయి! వ్యాపారులకు దాచే చోటు లేకుంటే, మార్కెట్ దొరక్కపోతే కొనరు. అప్పుడు మిర్చి రైతులు ఏమి చెయ్యాలి? తగుల బెట్టాలా?

మిర్చి రైతుల విషయంలో చేతులెత్తేసిన ముఖ్యమంత్రి మరొక నిజం ప్రజల ముందర పరచారు. ప్రభుత్వం కనీస మద్దత్తు ధర ప్రకటిస్తుంది. అది నిలబెట్టేందుకు మాత్రమే, తన శక్తి వున్నంత వరకే జోక్యం చేసుకుంటుంది. మొత్తం మార్కెట్ కుప్ప కూలిపోతే!?

ఇప్పుడు మిర్చి రైతుల వంతు. పత్తి రైతుల ఆత్మహత్యలకు గూడ సేద్యానికి- ప్రతిఫలం పొందేందుకు వ్యవసాయదారులు ఎదుర్కొంటున్న ఎడమే కారణం. టొమాటో రైతుల కథ, అంతకు పూర్వం పొగాకు రైతుల కథలో వున్న సారాంశం అదే. నిర్ణయించిన కనీస మద్దత్తు ధరకు ధాన్యం కొనేనాథుడు లేకుండా బాధపడుతున్నట్లు గతమాసం నెల్లూరు వెళ్లినప్పుడు విన్నాను. పండే పంటలో 8-10 శాతం మధ్య కొని ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ ద్వారా అందిస్తుంది. రాజకీయ కారణాలతో కొంత అదనంగా కొన్నా, రైతాంగానికి సబ్సిడీ చాల ఎక్కువ ఇచ్చి ఉద్ధరిస్తున్నట్లు అవాస్తవ ప్రచారం. ఇందులో అత్యధికభాగం ప్రొక్యూర్ చేసిన ఆహార పదార్థాలను, డిస్ట్రిబ్యూషన్‌కు మధ్య వుండే కాలంలో ఆ నిల్వలు కాపాడేందుకు అయ్యే కారీయింగ్ కాస్టు అని ఎఫ్.సి.ఐ. లెక్కలు గమనించిన వారికంతా తేలింది. ఎఫ్.సి.ఐ. కి ఎకనమిక్ కాస్ట్ లో ప్రొక్యూర్‌మెంట్ ఖర్చు శాతం, అంటే వ్యవసాయదారుకు లభ్యమయ్యే శాతం ఏఏటి కా యేడు తగ్గిపోతున్నది.

ఒప్పుడు పొగాకు రైతులు గూడ మార్కెట్ సంక్షోభం ఎదుర్కొన్నారు. అప్పుడే పొగాకు బోర్డ్ ఏర్పడింది. మార్క్సిస్టు పార్టీ పార్లమెంటు సభ్యులు జ్యోతిర్మయిబాసు ఆ రంగంలో పొగాకు సాగుదార్లు ఎదుర్కొంటున్న సంక్షోభానికి మూలం మార్కెట్ కొరత అని, ఆ కొరతను ఆ నాటి ఐ.ఎల్.టి.డి కంపెనీ రైతాంగాన్ని దోచుకుంటున్నదని గ్రహించి, కొనుగోలుకు, ఎగుమతులకు గల అవకాశాల మేరకే ఉత్పత్తిని క్రమబద్ధం చేసేందుకు పొగాకు పంట వేసేందుకు పర్మిట్ల పద్ధతి ప్రవేశపెట్టారు. ఆత్మహత్యలను నివారించారు.

పొగాకు వినియోగానికి పరిమితులు వున్నాయి. ఈ పరిమితులు ఇంకా పెరగాలి. ఐ.ఎల్.టి.డి వంటి కంపెనీలను అదుపులో పెట్టే అధికారం లేదు ఆయనకు. సోవియట్ దిగుమతులను బోర్డే చేపట్టేందుకు ఈ నాటి రాష్ట్ర ప్రభుత్వానికి మల్లే, బోర్డుకు నిధులు లేవు. ఫలితం వాణిజ్య వర్గాలు లాభాలే గాదు, రాజకీయాల్లో ప్రముఖులుగా కూడ విలసిల్లుతున్నారు. (ఆ నాటి ఐ.ఎల్.టి.డి., ఈ నాటి ఐ.టి.సి. ఆ కంపెనీ పన్నులు ఎగగొట్ట గలదు. రాజకీయ "మరలు" తిప్పి ఒప్పందాలు చేసుకోగలరు. ఈ మధ్య అలాంటి ఒప్పందంతో షుమారు నాలుగువందల కోట్లు మిగుల్చుకుంది. ఆ నాటి ఉద్ధరణ చాలక వేల కోట్ల రూపాయల పెట్టుబడితో ఆహార రంగంలో ప్రవేశిస్తున్నట్లు ప్రకటించింది. రైతాంగమా! తస్మాత్ జాగ్రత్త!!)

కాని ఆహార ధాన్యాల, దినుసుల విషయంలో, పొగాకు విషయంలో వున్న అవధులు లేవు. ఆహార ధాన్యాల విషయంలో మనం సాధించామని చెప్పుకుంటున్న "స్వయం సమృద్ధి" సాపేక్షికం మాత్రమే. ప్రజలందరికీ తగినంత ఆకలి వుంది. కడుపు నిండా తిని, ఆరోగ్యంగా బ్రతకాలనే కోరిక; తమ బిడ్డలకు తామే వండి పెట్టుకోవాలని, వారు చక్కగా చదువుకోవాలని, ప్రతివారి గుండెల్లో గూడు కట్టి వుండే కోరికే. వారి కోరిక నెరవేర్చుకునేందుకు లేనిదల్లా అవి తీర్చుకొనేందుకు ఈ సమాజం కోరే మూల్యం కొనుగోలు శక్తే. తమకున్న కొనుగోలు శక్తి మేరకన్నా తినాలని "తెల్ల కార్డుల" కోసం జనం ఎగబడుతున్నారు. మధ్యాహ్నం భోజనం పెడితేనే పిల్లలను బడికి పంపుతున్నారు.

అమ్ముకోడం వీలుగాని, సొమ్ము చేసుకోడం చేతగాని భూస్వాముల చేతుల్లో ఆహార ధాన్యాలు, దినుసులు, అవి పండే భూమి. వాణిజ్య పంటలు పండించడంలో వారిని అనుసరించక తప్పని స్థితిలో ఇతర వ్యవసాయదారులున్నారు.

ఆహార ధాన్యాలు, దినుసులు లేక ఆకలితో ప్రతిక్షణం కునారిల్లిపోతున్న భూమిలేని, చాలీ చాలని భూమివున్న గ్రామీణ పేదలు. గ్రామాల్లో బ్రతకలేక పట్టణాల కొచ్చి, అక్కడ బ్రతుకు దెరువు దొరక్క అవస్థలుపడే ప్రజలున్నారు.

అంతేగాదు మేధావులంతా కలసి దరిద్రానికి ఒకగీత గీశారు. ఆ గీత చూపే రాతతో దరిద్రాన్ని కొలిచి, అది బాగా తగ్గిపోతున్న దంటున్నారు. ఇంకా ఆ గీతను అందుకునే శక్తి లేని వారికి చౌక

బియ్యం అంటున్నారు. ఆ వాగ్దానాలతో ఓట్లు పండించుకుంటున్నారు. చౌక అంటే ఎంత? ప్రభుత్వానికి గిట్టుబాటు అయ్యే ఎకనమిక్ కాస్ట్ తో ముడిపెడుతున్నారు. ధర పెంచి, దరిద్రం పెంచుతున్నారు.

డబ్బులో కాకుండా శక్తిని కొలిచే కేలరీలలో వినియోగాన్ని లెక్క కడితే? ఆహారం తీసుకునేది శక్తికోసం. సాధారణ పనిచేసే వాడైనా తీసుకోవలసిన శక్తిని సైన్స్ నిర్ణయించింది. ఆ కొలమా నంతో చూస్తే, ఆంధ్రప్రదేశ్‌లో నూటికి 84 మంది శక్తిహీన ఆహారం తీసుకుంటున్నారని, ప్రభుత్వ లెక్కలతోనే ప్రొఫెసర్ ఉత్సా పట్నాయక్ రుజువు చేశారు.

మరొక చరిత్రను గూడ మననం చేసుకొంటే మంచిది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం భారత పారిశ్రామిక వేత్తల చేతుల్లో అపారమైన నిధులు పోగుపడ్డాయి. ఆ నిధులను పెట్టుబడిగా మార్చుకునేందుకు అవకాశాలు లేవు. ప్రపంచ యుద్ధకాలంలో బాధలు పడిన ప్రజలు ఆ నాటి వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడారు. ఆ పోరాటాన్ని గాంధీజీ నాయకత్వం హింసా హింసల తర్కంతో నాలుగు రోజుల తతంగం చేశారు. ఈ పోరాటంలో తలెత్తే పెట్టుబడిదారీ వర్గం (ఉద్యమానికి మేధావుల సారథ్యం. నేరుగా పెట్టుబడిదారులు పాల్గొనలేదు) చేతులు కలవకుండా నివారించేందుకు బ్రిటిష్ ప్రభుత్వం చక్కెర పరిశ్రమను భారతీయ పెట్టుబడికి కేటాయించింది. స్వాతంత్ర్య అనంతరం పాలకవర్గాలలో ఏర్పడిన ఘర్షణలో భూస్వామ్య శక్తులు ఆ తరువాత పెరిగే చక్కెర పరిశ్రమ సహకార రంగంలోనే పెరిగేలా చూసుకోగలిగారు.

తిండిగింజలు సేకరించే ఎఫ్.సి.ఐ. కి ప్రపంచబ్యాంకు పెత్తనం వచ్చే వరకు వడ్డీ బడ్జెట్ నుండే కేంద్ర ప్రభుత్వం చెల్లించేది.

పత్తి కొన్నా, పొగాకు కొన్నా ఆయా ప్రభుత్వరంగ సంస్థలకు కేంద్ర ప్రభుత్వమే సహాయపడేది.

కాని సీజనల్ వంటగా వుండే చెరుకుతో సీజన్‌లోనే తయారయ్యే చక్కెరను ఏడాది పొడుగున అమ్మడం. అంతవరకు బ్యాంకులకు నిల్వ ఖర్చులపై వడ్డీలు చెల్లించే బాధ్యత పరిశ్రమదే. ఆ విధంగా సహకార పరిశ్రమను దివాలా తీయించారు. ఇప్పుడు కారు చౌకగా తిరిగి పారిశ్రామికాధిపతులకు ఒప్పచెప్తున్నారు.

ఈ రోజు కేంద్ర ప్రభుత్వ విధానాలు ఇదే క్రమాన్ని వేగవంతం చేస్తున్నాయి. గ్రామీణ ఉత్పత్తి సాధనాలను పంచి మార్కెట్ పెంచే ఆలోచన లేదు. వ్యవసాయోత్పత్తులు పెంచేందుకు ప్రధానంగా అప్పుల పంపకం హామీ పెరిగే ఉత్పత్తుల మార్కెటింగ్ బాధ్యత తీసుకోవడం లేదు. పెరిగే ఉత్పత్తులు సహితం ఎగుమతికి తోడ్పడే పూలు, పండ్లు పెంచమంటున్నారు. వాటికోసం కోల్డ్ స్టోరేజీలు దిగుమతిపై సుంకం తగ్గించారు. ఇది బడ్జెట్. ఎగుమతి చేసే వ్యవసాయోత్పత్తులపై సుంకాలు రద్దు చేస్తూ ఎగ్జిమ్ పాలసీ ఈ నెల 9, 10 లలో జరిగిన అగ్రికల్చరల్ సమ్మిట్ 2005లో చిదంబరంగారి ఉపన్యాసం తాజావుదంతం.

కాంట్రాక్ట్ ఫార్మింగ్

ప్రైవేట్ మండీస్

చిల్లర వర్తకంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి

వ్యవసాయరంగంలో ప్రైవేట్-ప్రభుత్వ భాగస్వామ్యం (అంటే నీటిపారుదల నిర్వహణ, విత్తనాల తయారీ, పంపకం, శాస్త్రీయ సహకారం, అది రైతులకు అందించే యంత్రాంగం లాంటి వాటిలో నన్నమాట)

భూస్వాముల పెత్తనంలో శక్తి వుడిగి, చతికిల బడ్డ సహకార బ్యాంకులే గ్రామీణ రుణ పంపకానికి సాధనాలు కావాలని.

ఏతావాతా ఇచ్చే అప్పుల మొత్తం పెరుగుతుంది. పంపకంలో పద్ధతి అలాగే కొనసాగుతుంది. కౌలుదార్లు, పేద రైతాంగం ప్రైవేట్ రుణాలకే ఎగబడాలి. దివాలా తీసేవారు కోపరేటివ్ ఫార్మింగ్‌కు పోతారు. మండీల ప్రైవేటైజేషన్ మరింతగా తోడ్పడుతుంది. మార్కెట్లలో విదేశీ పెట్టుబడితో వినియోగదారు వ్యవసాయ ఉత్పత్తులకు ముఖం వాచి బతకాలి.

ఈ పరిస్థితి తెచ్చి పెట్టేందుకు ''రాజకీయ ఏకీభావం'' సాధించేందుకు యు.పి.ఏ ఆర్థిక మంత్రి పిలుపు.

ముఖ్యమంత్రి మిర్చి విషయంలో చేతులెత్తేసి ఏకీభావానికి నాంది పలికారు.

మిర్చి తగులబెట్టి మన వాతావరణం మనం ఎందుకు ఘాటు చేసుకోవాలి?

పాలకులు ఏకీభావానికి వచ్చేలోగానే వ్యవసాయ రంగంలో, గ్రామీణ పట్టణ పేదల్లో వ్యవసాయ రంగంతో బాధపడే వారమంతా ప్రత్యామ్నాయ విధానాల్లో ఏకీభావం సాధించుకుందాం.

కొనుగోలు శక్తిని పెంచే విధంగా గ్రామీణ ఆస్తుల పంపకం

భూమి పంపకం, ఆ భూమి ఫలవంతం అయ్యేందుకు నీరు, విత్తనాలు, ఎరువులు, నీరు; పంట పండించేందుకు కావాల్సిన ఇతర సౌకర్యాలు, పండిన పంట అమ్మి, అప్పులు తీర్చేందుకు 'సింగిల్ విండో' పద్ధతి ప్రవేశపెట్టి వ్యవసాయంలో బ్రతకగల అవకాశం కలిగించడం.

కావలసింది క్రమబద్ధంగా వ్యవసాయ ఉత్పత్తిని, తినేవారి అవసరాలు తీర్చే వ్యవసాయ ఉత్పత్తి విధానం.

పాలకులు అనుసరించేది వారి డాలర్ రాబడికి తలుపులు తెరిచే వ్యవసాయరంగం.

తిని, బతకాల్సిన వారు, కష్టపడి తిని బ్రతికే హక్కు కోసంఆరోగ్యకరంగా, విజ్ఞానయుత బ్రతుకుకోసండాలర్ దాహంతో పోట్లాడాలి.

ఏ పంట సమయంలో ఆ సాగుదార్లు ఏ ప్రాంత సాగుదార్లు ఆ ప్రాంతంలో చేతులు కాలినప్పుడు ఆందోళన చేసే పద్ధతి నుండి అందరం కలసి, మౌలికమైన విధానం కోసం పోరాడితేనే వ్యవసాయదార్లకు, వ్యవసాయానికే కాదు, కొని తినే వారందరి బతుకులు బాగుపడతాయి. ❑

# నేపాల్‌లో రాజరికం బతికి బట్ట కట్ట గలుగుతుందా?

-బి.సి. ఉప్రెతి

వరిపాలనకు ప్రజాస్వామ్యం అత్యంత న్యాయబద్ధమైన సరియైన రాజకీయ వ్యవస్థ అని ఎక్కువమంది సామాజిక శాస్త్రవేత్తలు అంగీకరిస్తారు. ప్రపంచీకరణ, సరళీకరణ శక్తులు కూడా మంచి పరిపాలనకు ప్రజాస్వామ్యం ఉత్తమ హామీ అని అత్యంత ప్రాముఖ్యత ఇచ్చాయి. దాని ఫలితంగానే ప్రపంచంలోని అనేక ప్రాంతాలలో ప్రజాస్వామ్యానికి విలువ పెరిగింది.

కానీ, నేపాల్‌లో రాజు జ్ఞానేంద్ర, మూడు సంవత్సరాలపాటు అధికారాలన్నిటిని స్వీకరిస్తూ 2005 ఫిబ్రవరి 1న నిర్ణయం చేయటంతో ప్రజాస్వామిక వ్యవస్థకు తీవ్ర అఘాతం కలిగింది. ఇప్పుడు రాజకీయ వ్యవహారాలకు నిరంకుశుడైన రాజు నాయకత్వం వహించటంతో ప్రజాస్వామ్యం తలక్రిందులైనట్లుగా కనిపిస్తోంది. అటువంటి తీవ్రమైన నిర్ణయం ఎందుకు తీసుకున్నట్లు? నేపాల్‌లో రాజరికం కుట్రకు ఏ పరిస్థితులు, ఏ శక్తులు మద్దతు ఇస్తున్నాయి? దేశంలోని రాజకీయ సమస్యలను రాజు ఎలా పరిష్కారం చేయబోతున్నాడు? ప్రజాస్వామ్యం పునరుద్ధరణకు ఏమి అవకాశాలు వున్నాయి?

నేపాల్‌లో 1951లో ప్రజాస్వామ్యం అమలుకు దారితీసిన విధానాల లోనే, రాజరిక వ్యవస్థ పునరుద్ధరణకు తలుపులు తెరచి ఉన్నాయన్న విషయాన్ని గుర్తు పెట్టుకోవటం ముఖ్యం. అందువల్ల, ప్రజాస్వామ్యంపై రాజరికపు నీడలు పరచుకున్న సంఘటనలు నేపాల్‌కు కొత్తేమీ కాదు. ప్రస్తుతం అమలులో వున్న సాంఘిక, ఆర్థిక పరిస్థితులు మాత్రమే కాకుండా, బలహీనమైన పార్టీ వ్యవస్థకు కూడా, రాజు రాజకీయ పెత్తనాన్ని చలాయించటానికి బాధ్యత వుంది. దానితో సమానంగా రాజుకున్న రాజకీయ పెత్తనం కోర్కె కూడా అందుకు తోడైంది.

యాభై దశకంలో అనుభవం లేని, సరియైన నిర్మాణం లేని రాజకీయ పార్టీలు, ప్రజాస్వామ్యాన్ని ముందుకు తీసుకు వెళ్ళ లేకపోయాయి. ఇది రాజు అధికారాల పెరుగుదలకు దారి తీసింది. త్రిభువన్ వంటి రాజు, పరిమితులకు మించి వెళ్ళ లేకపోవచ్చు. కానీ, గాఢ వాంఛగల మహేంద్ర వంటి రాజు రాజ సింహాసనం అధిష్ఠించినప్పుడు, రాజకీయంగా తన హక్కులను అమలు చేయటం ప్రారంభించాడు.

1960లో రాజరికపు కుట్రలో విజయం సాధించాడు. 1962లో నూతన తరహా ప్రభుత్వాన్ని ఊహించాడు. అదే పార్టీ రహిత పంచాయతీ వ్యవస్థ. ఆ వ్యవస్థ రాజు సర్వాధికారాలకు ముసుగుగా పనికి వచ్చింది. సుదీర్ఘ కాలం 1962 నుండి 1990 వరకు రాజకీయ వ్యవహారాలు రాజుక్రిందే నడిచాయి.

1990లో ప్రారంభమైన ప్రజాస్వామికోద్యమం రాజ్యాంగపరమైన రాజరిక వ్యవస్థ ఏర్పాటుకు దారి తీసింది. ఆ ప్రక్రియకు అప్పటి రాజు బీరేంద్ర సర్దుబాటు కావటానికి ప్రయత్నించాడు. అయితే, అతను పోవటంతో ఆ ప్రక్రియ తలక్రిందులైనట్టు కన్పిస్తున్నది.

సుస్థిరత, మంచి పరిపాలన, ప్రజాస్వామిక వ్యవస్థకు హామీ కల్పించటంలో 1990 తరువాత వరుసగా అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు విఫలం కావటంతో, బహుళ పార్టీల పరిపాలనకు ప్రత్యామ్నాయం కోసం పరిశోధన తీవ్రతరమైంది. 1991లో జరిగిన ఎన్నికల తరువాత నేపాల్ కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. పార్టీలోని అంతరంగిక తగాదాల వల్ల అధికారం నుండి వైదొలగింది. 1994లో జరిగిన మధ్యంతర ఎన్నికల తరువాత యునైటెడ్ మార్క్సిస్టు లెనినిస్టు (యు.ఎం.ఎల్) పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. దాదాపు అటువంటి పరిస్థితుల కారణంగానే ఆ పార్టీ కూడ అధికారం నుండి వైదొలగింది. యు.ఎం.ఎల్ ప్రభుత్వం వైదొలగిన తరువాత నేపాల్ అస్థిరమైన ప్రభుత్వాల యుగంలోకి జారుకుంది. దానితో పరిస్థితి మరింత విచ్ఛిన్నమైంది.

షేర్ బహదూర్ దేవ్‌బా నాయకత్వాన 1995లో నేపాలీ కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పాటు చేసినప్పుడు స్థిర ప్రభుత్వం ఏర్పాటు చేయటంలో రెండవ శ్రేణి నాయకత్వం జయప్రదం కావచ్చునని నమ్మారు. కానీ, అది జరగలేదు. 1997 మార్చ్‌లో దేవ్‌బా గద్దె దిగవలసి వచ్చింది. యునైటెడ్ మార్క్సిస్టు-లెనినిస్టు-నేషనల్ డెమొక్రటిక్ పార్టీ-నేపాల్ సద్భావనీ పార్టీ- (యు.ఎం.ఎల్- ఎన్.డి.పి - ఎన్.ఎస్.పి)ల సంకీర్ణ ప్రభుత్వం ఈ స్థానంలో వచ్చింది. ఎన్.డి.పికి చెందిన లోకేంద్ర బహదూర్ చంద్ నాయకత్వం వహించారు. ఈ సంకీర్ణ ప్రభుత్వం కూడా ఆరునెలల కంటే ఎక్కువ

కాలం వుండలేక పోయింది. ఈ ప్రభుత్వం స్థానంలో మరొక సంకీర్ణ ప్రభుత్వం-యు.ఎం.ఎల్- ఎన్.డి.పి-ఎన్.ఎస్.పి-సూర్య బహదూర్ థాపా నాయకత్వాన ఏర్పడింది. ఈ థాపా ఎన్.డి.పి కి చెందినవాడు. పార్లమెంటులో 19 స్థానాలు మాత్రమే ఉన్నప్పటికీ ఎన్.డి.పి కి చెందిన లోకేంద్ర బహదూర్ చంద్, సూర్య బహదూర్ థాపా ఇద్దరూ ప్రధాన మంత్రి పదవిని అలంకరించటం విశేషం. థాపా ప్రభుత్వం, నేపాలీ కాంగ్రెస్ నుండి గట్టి వ్యతిరేకత ఎదుర్కోవలసి రావటంతో 1998 ఏప్రిల్‌లో ప్రభుత్వం వైదొలగవలసి వచ్చింది.

నూతన సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటుకు గల అవకాశాలను పరిశీలించటం నేపాలీ కాంగ్రెస్ మరొక పర్యాయం ప్రారంభించింది. అనుకోకుండా, స్థానిక సంస్థల ఎన్నికల తరువాత 1997 సంవత్సరం చివరిలో యు.ఎం.ఎల్ పార్టీ చీలిపోయింది. యు.ఎం.ఎల్ కు చెందిన 40 మంది పార్లమెంటు సభ్యులు బామ్‌దేవ్ గీతం, సి.డి. మూనాలిల నాయకత్వాన కొత్త రాజకీయ పార్టీని-కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ నేపాల్- మార్క్సిస్టు-లెనినిస్టు (సి.పి.ఎన్-ఎం.ఎల్) ఏర్పాటు చేశారు. నేపాలీ కాంగ్రెస్, ఎం.ఎల్ పార్టీ సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటుకు ఒక అవగాహనకు వచ్చారు. నూతన భాగస్వామికోసం నేపాలీ కాంగ్రెస్ వెతుకుతూ వుండగా, యు.ఎం.ఎల్ కు వ్యతిరేకంగా తన స్థానాన్ని మెరుగు పరచుకోవాలని ఎం.ఎల్. పార్టీ కోరుకోంటోంది. ఈ సంకీర్ణ ప్రభుత్వానికి జి.పి. కోయిరాలా ప్రధానమంత్రి అయ్యారు. ఆరు నెలల తరువాత ప్రధానమంత్రి పదవిని రెండవ భాగస్వామికి ఇవ్వాలన్నది ఆ రెండు పార్టీల మధ్య అవగాహన.

కోయిరాలా 1998 డిసెంబర్‌లో ప్రధాని పదవిని ఎం.ఎల్ పార్టీకి అప్పగించటానికి నిరాకరించాడు. అనేక ఇతర సమస్యలపై కూడా భాగస్వాములు ఇద్దరి మధ్య విభేదాలు వృద్ధి చెందాయి. 25 అంశాల కార్యక్రమాన్ని ఎం.ఎల్.పార్టీ జారీ చేసింది. అందులో మంత్రి వర్గంలో తమ ప్రాతినిధ్యం పెంచాలని కూడా వుంది. కాలాపాని సమస్య మొదలైనవి వున్నాయి. ఆ డిమాండ్లను కోయిరాలా ఒప్పుకోలేదు. 1998 డిసెంబరు 10న, మంత్రివర్గంలోని 13 మంది మంత్రులు తమ పదవులకు రాజీనామా చేశారు. కోయిరాలా ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టాలని పార్టీ నిర్ణయించింది. అయితే, నేపాలీ కాంగ్రెస్‌ను కాపాడటానికి యు.ఎం.ఎల్ ముందుకు వచ్చింది. పార్టీకి మద్దతు ఇవ్వటం ఇష్టంగాక, ఎం.ఎల్ పార్టీని తొలగించాలని అది కోరుకుంటున్నది. కోయిరాలా తన పదవికి రాజీనామా చేశాడు. పార్లమెంటు రద్దు అయింది. 1999 మేలో కొత్తగా ఎన్నికలు ప్రకటించాడు. ఎన్నికలు జరిగే వరకు ఎన్.సి-ఎం.ఎల్-ఎన్.ఎస్.పి జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

నేపాలీ రాజకీయాలలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు పరిశోధన అత్యంత చేదు అనుభవం. అది రాజకీయ అస్థిరతను సృష్టించటమే కాకుండా, దేశంలో ప్రజాస్వామ్యంకు గల అవకాశాలను కూడా తగ్గించింది. సంకీర్ణ ప్రభుత్వంలో, దానిలోని భాగస్వాముల మధ్య పెద్ద సంఖ్యలో సమస్యలున్నాయి.

1. సంకీర్ణ ప్రభుత్వంలోని రాజకీయ పార్టీల మధ్య సరియైన అవగాహన, సమన్వయం లేదు.
2. అన్ని సంకీర్ణ ప్రభుత్వాలలోనూ, ప్రతి భాగస్వామ్య రాజకీయ పార్టీ వ్యక్తిగతంగా పనిచేశాయి.
3. సంకీర్ణ ప్రభుత్వంలోని ప్రతి భాగస్వామి వివిధ సంస్థలలో తమ సొంత మనుషులకు పెట్టటానికి ప్రయత్నించాయి. దానివల్ల వ్యవస్థే దెబ్బతిన్నది.
4. రాజకీయ పార్టీల దృక్పథం, స్వల్పకాల స్వప్రయోజనాలకే పరిమితమైంది. దీర్ఘకాల, జాతీయ సమస్యల పట్ల వారికి తగినంత శ్రద్ధ లేదు. ప్రజాస్వామ్యాన్ని చట్ట బద్ధం చేసే ప్రక్రియ పట్ల ఎవరికీ శ్రద్ధ వున్నట్లు కన్పించలేదు.
5. సామాజిక-ఆర్థిక సమస్యలపట్ల, ప్రజల అవసరాలు, ఆకాంక్షల పట్ల శ్రద్ధ తీసుకోడానికి సంకీర్ణ ప్రభుత్వాలకు సమయం దొరికేది

   కాదు.
6. సంకీర్ణ ప్రభుత్వాలలోని భాగస్వాములకు ఏరకమైన సిద్ధాంత పరమైన పొందిక లేదు. వాస్తవానికి సిద్ధాంతపరంగా పనికి రాని వారు. అందువల్ల, వారిలో ఎక్కువమంది అధికార నాటకంలో మాత్రమే పాల్గొన్నారు. ఏ విధంగానైనా సరే అధికారంలో వుండటమే వారి లక్ష్యంగా కన్పించింది. సంకీర్ణ ప్రభుత్వంలోని ప్రతి రాజకీయపార్టీ, ఎక్కువ అధికారాలు సంపాదించాలని, కోరుకోవటం వల్లనే సంకీర్ణ ప్రభుత్వాలు విఫలమయ్యాయి.

1999 ఎన్నికల తరువాత నేపాలీ కాంగ్రెస్ కె.పి. భట్టారాయ్ నాయకత్వాన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. అయితే, భట్టారాయ్ ప్రభుత్వం త్వరలోనే తమ పార్టీ కార్యకర్తల నుండి విమర్శను ఎదుర్కోవలసి వచ్చింది. మావోయిస్టు సమస్యపట్ల ఉదాసీన వైఖరి ప్రదర్శిస్తున్నాడని అసమర్థుడు మొదలైన ఆరోపణలు కార్యకర్తలు చేశారు. 1999 డిసెంబర్ నుండి కోయిరాలా గ్రూపు ప్రభుత్వాన్ని వ్యతిరేకించటం ప్రారంభించింది. రాజీనామా చేయుమని భట్టారాయ్‌పై వత్తిడి తీసుకురావటం ప్రారంభించింది. అతని ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానం తీసుకొస్తామని బెదరించింది. వత్తిడి ఎత్తుగడలు జయప్రదం అయ్యాయి.

భట్టారాయ్ 2000 ఫిబ్రవరిలో పదవికి రాజీనామా చేశారు.

కానీ, కోయిరాలాకు పరిస్థితులు ఇంక ఏమాత్రం, ఇంతకు ముందున్నట్లు, సాఫీగా లేవు. పార్లమెంటరీ పార్టీ నాయకత్వం కావాలని షేర్ బహదూర్ దేవ్‌బా కూడా రంగంలోకి దిగాడు. కోయిరాలా, దేవ్‌బా మధ్య పోటీని ఓటింగ్ ద్వారా పరిష్కరించవలసి వచ్చింది. ఓటింగ్‌లో కోయిరాలకు 69 ఓట్లు, దేవ్‌బాకు 43 ఓట్లు వచ్చి కోయిరాలా గెలుపొందాడు. 2000 మార్చిలో ప్రధానమంత్రి అయ్యాడు.

నేపాల్‌లో 2001 నవంబర్ 26న అత్యయిక పరిస్థితిని (ఎమర్జెన్సీ) ప్రకటించారు. మావోయిస్టులను అదుపు చేయవలసిందని సైన్యాన్ని ఆదేశించారు. 2002 ఫిబ్రవరి, మే నెలలో అత్యయిక పరిస్థితిని పొడిగించారు. మావోయిస్టు సమస్యను పరిష్కరించేందుకు దేవ్‌బా నిజాయితీగా కృషి చేశాడనటంలో సందేహం లేదు. అయినా, మౌలిక సమస్యలపై మావోయిస్టులతో ఓకక్క పార్టీ రాజీ పడటానికి సిద్ధంగా లేదు.

అనేక పరిణామాల కారణంగా కోయిరాలా ప్రధానమంత్రి పదవీకాలం సందిగ్ధంలో పడింది. అవినీతి విస్తృతంగా వుందన్న ఆరోపణను ఆయన ప్రభుత్వం ఎదుర్కోవలసి వచ్చింది. ఆ సమయానికి మావోయిస్టు సమస్య కూడా తీవ్రతరమైంది. ఈ సమస్య పరిష్కారానికి కోయిరాలా నిర్దిష్టమైన చర్యలేవీ తీసుకోలేదు. 2000 జూన్ 1న రాజు బీరేంద్ర, ఆయన కుటుంబం మొత్తం హత్య చేయబడ్డారు. ఈ సమస్యపై ప్రభుత్వం తగినంతగా స్పందించలేదన్న ఆరోపణకు గురైంది. ప్రతిపక్ష రాజకీయ పార్టీలు కూడా, కోయిరాలాను లక్ష్యంగా పెట్టుకుని విమర్శలు ప్రారంభించాయి.

2001 జూలైలో కోయిరాలా రాజీనామా చేయక తప్పింది కాదు. నేపాలీ కాంగ్రెస్ ప్రభుత్వపు ప్రధానమంత్రిగా దేవ్‌బా తిరిగి ప్రధానమంత్రి పదవి చేపట్టాడు. మావోయిస్టుల సమస్యను పరిష్కారాన్ని దేవ్‌బా తీవ్రంగా తీసుకున్నాడు. ఇంతకు ముందు కూడా, మావోయిస్టు సమస్యకు పరిష్కారానికి భట్టారాయ్ ప్రధానమంత్రిగా వున్న కాలంలో ఏర్పాటు చేసిన కమిటీకి దేవ్‌బా నాయకత్వం వహించాడు. కాల్పుల విరమణకు మావోయిస్టులతో సంప్రదింపులు జరిపి, మావోయిస్టులను చర్చలకు వచ్చేటట్లు చేయటంలో దేవ్‌బా విజయం సాధించాడు. 2001 ఆగస్ట్ నవంబర్ మధ్యలో ప్రభుత్వానికి, మావోయిస్టు నాయకులకు మధ్య మూడు దఫాలు చర్చలు జరిగాయి. అయినప్పటికీ రాజ్యాంగ సభ, రిపబ్లిక్ ప్రభుత్వం, నూతన రాజ్యాంగం ఏర్పాటు చేయాలన్న దాని కంటే తక్కువకు మావోయిస్టులు అంగీకరించలేదు. ఆమోదించలేదు. ఆ డిమాండ్లలో దేనినీ ఆమోదించటానికి ప్రభుత్వం సిద్ధంగా లేదు. చర్చలు విఫలమయ్యాయి. మావోయిస్టులు తిరిగి తమ ఉద్యమాన్ని ప్రారంభించారు.

నేపాల్‌లో 2001 నవంబర్ 26న అత్యయిక పరిస్థితిని (ఎమర్జెన్సీ) ప్రకటించారు. మావోయిస్టులను అదుపు చేయవలసిందని సైన్యాన్ని ఆదేశించారు. 2002 ఫిబ్రవరి, మే నెలలో అత్యయిక పరిస్థితిని పొడిగించారు. మావోయిస్టు సమస్యను పరిష్కరించేందుకు దేవ్‌బా నిజాయితీగా కృషి చేశాడనటంలో సందేహం లేదు. అయినా, మౌలిక సమస్యలపై మావోయిస్టులతో ఓకక్క పార్టీ రాజీ పడటానికి సిద్ధంగా లేదు. 2002 మేలో దేవ్‌బా తన పదవికి రాజీనామా చేశాడు. పార్లమెంటును రద్దు చేశారు. నేపాల్‌లో కొత్తగా ఎన్నికలు జరుగుతాయని భావించారు. నేపాలీ కాంగ్రెస్ రెండుగాచీలిపోయింది.

నేపాల్‌లో సుస్థిర ప్రభుత్వం ఏర్పాటు చేయటంలో రాజకీయ పార్టీలు స్పష్టంగా విఫలమయ్యాయి. దాదాపు ప్రధాన రాజకీయ పార్టీలన్నీ, ఆంతరంగిక చీలికలతో, ముఠాతత్వంతో, నాయకత్వపు ఘర్షణలతో బలహీనమైన సాంఘిక పునాదితో, సిద్ధాంత పరంగా పతనమై, పార్టీల మధ్య వివాదాలతో కొట్టుమిట్టాడుతున్నాయి. పార్టీల నాయకుల రాజకీయ అత్యాశలు, ముఠాతత్వం వల్ల, పార్టీలు చీలికలకు దారి తీశాయి. పార్టీ వ్యవస్థ మరింత బలహీనపడింది. దేశంలో తగినంతగా ప్రజాస్వామిక వ్యవస్థ నిర్మాణంలో కూడా పార్టీలు విఫలమైనాయి. ఇందువల్లనే, ప్రజావనరాలు, ప్రజల ఆకాంక్షలు నెరవేరకుండానే మిగిలిపోయాయి. దానితో ప్రజలలో అసంతృప్తి పెరిగింది. ఇది దేశంలో మావోయిస్టుల తిరుగుబాటుకు దోహద పడింది.

2002 అక్టోబర్‌లో, మావోయిస్టుల తిరుగుబాటు వల్ల, సకాలంలో ఎన్నికలు జరపటం సాధ్యం కాదని, అందువల్ల ఎన్నికలను వాయిదా వేయమని దేవ్‌బా సూచించాడు. కానీ, రాజు అందుకు అంగీకరించకపోగా, ప్రభుత్వాన్ని రద్దు చేశాడు.

ఎన్నికైన ప్రభుత్వాన్ని రద్దు చేసిన తరువాత, ఎన్.డి.పి.కి చెందిన లోకేంద్ర బహదూర్ చాంద్‌ను చిన్నమంత్రి వర్గంతో, ప్రధానమంత్రిగా నామినేట్ చేశారు రాజు జ్ఞానేంద్ర. నేపాలీ కాంగ్రెస్, యు.ఎం.ఎల్. వంటి పెద్ద పార్టీలు ప్రభుత్వంలో చేరలేదు. స్వయంగా రాజే, ఇంతకు ముందు ఎన్నడూ లేని విధంగా, స్వయంగా బాధ్యత వహించి ప్రజాస్వామిక ప్రక్రియను పునరుద్ధరించాడు.

2003 మధ్యలో మావోయిస్టులను చర్చల బల్ల వద్దకు తీసుకు

రావటంలో రాజు విజయం పొందాడు. అయితే ఒప్పందం కుదుర్చుకోవటంలో విఫలమయ్యాడు. తాము ఇంతకు ముందు ప్రకటించిన డిమాండ్లను విడిచిపెట్టడానికి మావోయిస్టులు సిద్ధం కాలేదు. వాటిని అమోదించటానికి రాజు సిద్ధంగా లేడు. మావోయిస్టు సమస్యను పరిష్కరించాడన్న ఘనతను కొట్టేయాలని రాజు కోర్కె. కాని, విఫలమయ్యాడు. కానీ, రాజకీయ పార్టీలను ప్రక్కన పెట్టటంలో జయప్రదం అయ్యాడు. మావోయిస్టులతో చర్చలు విఫలం కావటంతో, లోకేంద్ర బహదూర్ చాంద్ పదవినుండి వైదొలగటం, సూర్య బహదూర్ థాపా ప్రధానమంత్రి కావటం జరిగింది.

ఇక్కడ ఒక విషయం గుర్తించాలి. పంచాయతీ యుగం పాత నాయకులపై రాజు ఆధారపడ్డాడు. చాంద్, థాపాలు ఇద్దరూ, పంచాయతీ యుగంలో పలుకుబడి గల నాయకులు. రాజు మద్దతు దారులు. వారు పంచాయత్ అనుకూల, రాజు మద్దతు దారులు కావటం కారణంగా వచ్చిన ప్రతిష్ఠ వల్ల, వివిధ రాజకీయ పార్టీల మద్దతు కూడ గట్టడంలో విఫలమయ్యారు. వారి సొంత పార్టీలోనే వారికి బలమైన స్థానం లేదు. 2004లో ప్రధానమంత్రిగా వున్న సూర్య బహదూర్ థాపాను పార్టీనుంచి తొలగించాలని ఎన్.డి.పి నిర్ణయించటంతో పార్టీలో అతని స్థానం మరింత బలహీనపడింది.

రెండవ ప్రక్కన, సాధారణ ఎన్నికలు జరిపించటానికి గానీ, పార్లమెంటును పునరుద్ధరించేందుకు గానీ రాజుపై వత్తిడి తీసుకురావటంతో రాజకీయ పార్టీలు విఫలమయ్యాయి. ప్రజల బాధల పట్ల రాజు మౌన ప్రేక్షకుడుగా వుండడని 2004 ఫిబ్రవరిలో చేసిన ఒక ప్రకటనలో రాజు జ్ఞానేంద్ర స్పష్టం చేశాడు.

***2005 ఫిబ్రవరిలో జరిగిన కుట్ర తరువాత జ్ఞానేంద్ర ముందున్న ప్రధాన సవాల్ ఏమిటంటే, తన అధికారాన్ని సంఘటిత పరుచు కోవటం, పరిస్థితిని అదుపులోకి తీసుకురావటం. అందుకు గాను ప్రజాస్వామిక శక్తులపై అణచివేత చర్యలను చేపట్టాడు. పత్రికలను, ఇతర ప్రచార సాధనాలను సైన్యాన్ని, పోలీసులను ఉపయోగించి అదుపులోకి తీసుకొచ్చాడు. రాజుకు సైన్యం విధేయతతో వుండటం వల్ల అణచివేత చర్యలు తీసుకోవటం సాధ్యం అయ్యింది.***

2004 మధ్యలో ప్రధాన మంత్రిగా దేవ్‌బా మరొక పర్యాయం నియమించబడ్డాడు. సంప్రదింపులకు అంగీకరించమని మావోయిస్టులకు దేవ్‌బా అల్టిమేటం ఇచ్చాడు. అదీ విఫలమైంది. అదే సమయంలో ఎన్నికల తేదీల ప్రకటన విషయంలో ఊహాగానాలు బయలు దేరాయి. నేపాలీ కాంగ్రెస్ వంటి రాజకీయ పార్టీలు తమ నాయకత్వాన్ని సంఘటిత పరచుకోవటానికి ప్రయత్నిస్తున్నాయి. రాజకీయ సంఘటనలను చూస్తూ వుండే సహనం లేని రాజు దేవ్‌బా ప్రభుత్వాన్ని రద్దు చేయటం ద్వారా నేపాల్ రాజకీయాలకు కొత్త మార్గం చూపాలని నిర్ణయించుకున్నాడు. క్రమబద్ధమైన, అంచనా పద్ధతిలో రాజు పనిచేస్తున్నట్లు స్పష్టమైంది. ప్రారంభంనుంచి అతని ఉద్దేశ్యం స్పష్టమైంది. రాజుకు ఒక రాజకీయ స్థానం సృష్టించాలని కోరిక. అదే సమయంలో నేపాల్‌లో ప్రజాస్వామ్యం, శాంతి, సుస్థిరతల వైఫల్యానికి రాజకీయ పార్టీలు కారణమని నిందించాలన్నది ఆయన ఉద్దేశ్యం.

2005 ఫిబ్రవరిలో జరిగిన కుట్ర తరువాత జ్ఞానేంద్ర ముందున్న ప్రధాన సవాల్ ఏమిటంటే, తన అధికారాన్ని సంఘటిత పరుచు కోవటం, పరిస్థితిని అదుపులోకి తీసుకురావటం. అందుకు గాను ప్రజాస్వామిక శక్తులపై అణచివేత చర్యలను చేపట్టాడు. పత్రికలను, ఇతర ప్రచార సాధనాలను సైన్యాన్ని, పోలీసులను ఉపయోగించి అదుపులోకి తీసుకొచ్చాడు. రాజుకు సైన్యం విధేయతతో వుండటం వల్ల అణచివేత చర్యలు తీసుకోవటం సాధ్యం అయ్యింది. అయితే, ఇది ఎంత కాలం ఏమేరకు అన్నది అనిశ్చితం. రాజకీయ పార్టీలను వక్కన పెట్టటం తాత్కాలికంగా జయప్రదం అయినప్పటికీ, ఇది నిలబెట్టుకోవటం కష్టం.

ప్రజాస్వామిక శక్తుల నాయకులు అవినీతి, అధికార దుర్వినియోగం వంటి ఆరోపణలను ఎదుర్కొన్నప్పటికీ, రాజుకు సాంప్రదాయికంగా మద్దతు స్థానం అయిన పంచాయతీ యుగం రాజకీయ నాయకత్వం కోసం ఎదురు చూశాడు. పాత నాయకులలో కొంతమంది తిరిగి రాజకీయ రంగంలో ముందుకు వచ్చారు. వారి ప్రభావం ఎంతవరకు ఉంటుందో చెప్పటం కష్టం. పంచాయతీ పార్టీలలో వ్యక్తులకంటే సంస్థకు ప్రాముఖ్యత తక్కువ. అధికార గణంలోని కొన్ని సెక్షన్లు రాజుకు తమ మద్దతును ఇవ్వవచ్చు. కాని, అధికార సెక్షన్ తమ విధేయతను మార్చుకున్న చారిత్రిక సంఘటనలు ఉన్నాయి.

ఇప్పటికే మావోయిస్టులతో పోరాడుతున్న సైన్యం పౌర అజమాయిషీ కింద కొత్త పాత్ర నిర్వహించడానికి ఆమోదించవలసి వుంది. దానివల్ల దానిపై భారం రెట్టింపు అవుతుంది. మావోయిస్టులతో జరుపుతున్న ఎడతెగని పోరాటం వల్ల సైన్యం నిస్పృహ చెంది వుంది. అందువల్ల తన అధికారాన్ని రాజు సంఘటిత పరచుకోవటం కష్టంతో కూడినదని రుజువు కావచ్చు.

అటువంటప్పుడు ఉన్న అవకాశాలు ఏమిటి? నేపాల్‌లో తన రాజకీయ నాయకత్వం నిలబెట్టుకున్నప్పటికీ, అది దీర్ఘకాలం

**నేపాల్‌లో నేడు మూడు రాజకీయ శక్తులు వున్నాయి. రాజు, రాజకీయ పార్టీలు, మావోయిస్టులు. ప్రస్తుతం అవి ఒకదాని కొకటి వ్యతిరేకంగా చీలి వున్నాయి.**

వుండదు. రాజు భావించినంత కాలం కూడా ఉండకపోవచ్చు. నేపాల్‌లో, ప్రజాస్వామిక శక్తులు చీలివున్నప్పటికీ, తమ అసమర్థతకు తామే బలి అయినప్పటికీ, తిరిగి పోరాడే శక్తి వాటికి వుంది. ప్రజలు ప్రజాస్వామ్యాన్ని ప్రజా ఉద్యమాల ద్వారా పునరుద్ధరించుకోగలదన్న వాస్తవాన్ని చరిత్ర రుజువు చేసింది.

రాజు చేసిన చర్య ముందు చూపుతో చేసినట్లు కన్పించటం లేదు. రాజు చర్యకు కొన్ని దిక్కులనుండి మద్దతు లభించినా దేశంలోనూ, ప్రాంతీయం గాను, అంతర్జాతీయం గాను-(ఉదాహరణకు భారతదేశంలో కొందరు. హిందూ రాజు ఒక్కడే కావటం వల్ల) మద్దతు లభించవచ్చు.

దేశంలో రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడాలన్న డిమాండ్‌తో నేపాల్ ఒక తిరుగుబాటును ఎదుర్కొంటున్నది. మావోయిస్టులతో ఇప్పుడు ముఖాముఖీగా వున్న రాజు ఎలా వ్యవహరిస్తాడు? ఈ రెండు శక్తుల మధ్య రాజీకి ఏమైనా అవకాశం వుందా? ప్రస్తుతానికి రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడాలన్న తమ డిమాండ్ విషయంలో మావోయిస్టులు రాజీపడటానికి ఇష్టంగా వున్నట్లు కన్పించటం లేదు. అలా అయితే, మావోయిస్టులతో రాజు నరాసరి ఎదుర్కోవలసి వుంటుంది. అందువల్ల వ్యవస్థ ప్రమాదంలో పడుతుంది.

మావోయిస్టు సమస్యకు ఏరకమైన సైనిక పరిష్కారమైనా, రాయల్ ఆర్మీకి విదేశీ సహాయంపై ప్రధానంగా ఆధారపడి వుంటుంది. తన సొంత వనరులతోనే రాయల్ ఆర్మీ మావోయిస్టు తిరుగుబాటు దారులతో పోరాడ లేదని స్పష్టమైంది. అందువల్ల, విదేశీ మద్దతు, ప్రత్యేకించి ఇండియా, అమెరికా, ఇంగ్లాండ్, మరికొన్ని ఇతర దేశాల మద్దతు ముఖ్యమైనది. ఈ దేశాలు ఇప్పటికే ప్రభుత్వ అధికారాన్ని రాజు చేపట్టటం పట్ల తమ అసంతృప్తిని వ్యక్తం చేశాయి. దేశంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరించాలని కోరాయి. రాజుపై తమ వత్తిడిని కొనసాగిస్తే, సైనిక సహాయాన్ని ఉపసంహరించుకుంటే, (ఇండియా, బ్రెజిల్ దేశాలు ఆ పని ఇప్పటికే చేశాయి) అప్పుడు రాయల్ ఆర్మీ తీవ్రమైన ఇబ్బందులలో పడవచ్చు. సహాయానికి ప్రత్యామ్నాయ వనరులు చూపటం రాజుకు సాధ్యమేనా అన్నది వివాదాస్పదమైన ప్రశ్న.

నేపాల్‌లోని వివిధ రాజకీయ పార్టీలు ప్రస్తుతం తీవ్రమైన మార్పులకు లోనౌతున్న స్థితిలో వున్నాయి. అయితే అవి ఇంకా తుడిచివేయబడలేదు. భవిష్యత్తులో అవి నిలదొక్కుకొనే అవకాశాలు పూర్తిగా పోలేదు. ముప్పై సంవత్సరాల పంచాయతీ పరిపాలన తరువాత తిరగబడినట్లు గానే, ఎందుకు తిరగబడకూడదు? అయితే ఒకే ఒక ప్రశ్న వుంది. గతం నుండి వారు ఏమైనా గుణపాఠం నేర్చుకున్నారా? రాజుకు వ్యతిరేకంగా తిరగబడటానికి ఎంత కాలం కావాలి?

నేపాల్‌లో నేడు మూడు రాజకీయ శక్తులు వున్నాయి. రాజు, రాజకీయ పార్టీలు, మావోయిస్టులు. ప్రస్తుతం అవి ఒకదాని కొకటి వ్యతిరేకంగా చీలి వున్నాయి. ప్రజాస్వామిక శక్తుల సమీకరణ రెండు దశలలో సాగవలసి వుంది. మొదటగా వివిధ రాజకీయ పార్టీల మధ్య ఒక అవగాహన కుదరాలి. తరువాత ప్రజాస్వామ్యం పునరుద్ధరణకు, ప్రజా ఉద్యమం ప్రారంభించటానికి మావోయిస్టులతో చేతులు కలపాలి. ఈ ప్రజా ఉద్యమంలో చేరటానికి మావోయిస్టులు సిద్ధం కాకపోయినా, పరోక్షంగా ప్రజాస్వామిక ఉద్యమానికి వారి మద్దతు వుంటుందనటంలో సందేహం లేదు. ఈ పరిస్థితి రావటానికి ఎంతకాలం పడుతుందన్నది ప్రశ్న.

రాజకీయ పార్టీలలో రాజు పట్ల వున్న భ్రమలు తొలగటంపై ఇది ఆధారపడి వుంటుంది. రాజరికం నీడలోనే పౌర పరిపాలన సాగించాలని రాజకీయ పార్టీలు ఇంతకాలంగా కోరుతూ వచ్చాయి.

నేపాల్ భూభాగంలో నాలుగింట మూడు వంతులు మావోయిస్టుల పాలనలో వుందని అందరూ అంగీకరిస్తున్న విషయం. ఖాట్మండు లోయ ప్రాంతానికే రాజు పరిపాలన పరిమితమైంది. రాజధాని ఖాట్మండు కూడా తరచు దీర్ఘకాల దిగ్బంధానికి గురౌతున్నది.

రిపబ్లిక్ ప్రభుత్వం ఏర్పడాలని, నూతన రాజ్యాంగం రచించాలని మావోయిస్టులు కోరుతున్నారు. ఆ కోర్కెల సాధనకు జరిగే ఉద్యమంలో ప్రజాస్వామిక వాదులందరూ చేరాలని కూడా వారు ఇటీవల విజ్ఞప్తి చేశారు. అందువల్ల, రాజరికం భవిష్యత్తు ఎలా ఉంటుందో చూడాలి.

**(సెమినార్ ఏప్రిల్ 2005 సంచికలోని వ్యాసానికి అనువాదం: కొల్లి సత్యనారాయణ)**

❑

# నదుల అనుసంధానం - ఒక మార్మికత

-వెన్నెలకంటి రామారావు

2004 మార్చి 26 అర్థరాత్రి కర్ణాటక రాష్ట్రానికి చెందిన వందలాది మంది రైతాంగం మహారాష్ట్రలోని కృష్ణానదిపై కట్టిన రాజ్‌పూర్ బ్యారేజిపై రెండవసారి పెద్ద ఎత్తున దాడి చేసి, దానికి గల 65 గేట్లలో 35 గేట్లను ఊడదీశారు. "భవిష్యత్తులో జరగబోయే మరింత విధ్వంసానికి, ఈ డ్యాంను నాశనం చేయడం అనేది ఒక ప్రారంభం మాత్రమే" అని నినాదాలు చేస్తూ, అడ్డుకోబోయిన స్థానికులపై దాడిచేసి, మూడు గంటల పాటు స్వైరవిహారం చేశారు. దేశంలోని అనేక జల వివాదాలు భవిష్యత్తులో చిలికి, చిలికి గాలి వానగా మారబోతున్నాయనడానికి ఇదొక ప్రమాద ఘంటిక. భూగోళంలోనే అత్యధిక శాతం మంచినీటి సంపద కల్గిన భారత ద్వీపకల్పం జాతీయ, అంతర్జాతీయ పాలకుల విధానాల పర్యవసానంగా జల వైషమ్యాల అగ్నిగుండంగా మారబోతోంది. సమగ్రమైన, శాస్త్రీయమైన జలవిధానం రూపకల్పన జరగకపోతే అంతర్రాష్ట్రీయ, అంతర్ జాతీయ సరిహద్దుల వెంబడి, వివిధ రూపాలలో తీవ్రమైన జల యుద్ధాలు చెలరేగుతాయి. ప్రపంచబ్యాంకు నిర్దేశిత, పర్యావరణ విధ్వంసక విధానాల ఫలితంగా సాగునీటి, తాగునీటి కరువు భారత ప్రజలను కమ్మేస్తోంది. దానికి పరిష్కారంగాను, సర్వరోగ నివారిణిగాను, నదుల అనుసంధాన కార్యక్రమాన్ని అన్ని రాజకీయ పార్టీలు తారక మంత్రంగా జపిస్తున్నాయి. తరచి చూడగా జబ్బుకంటే మందే ప్రమాదకరంగా కనపడుతోంది.

నదుల అనుసంధానం పథకాన్ని 19వ శతాబ్దం మధ్యలో సర్‌ఆర్థర్ కాటన్ మొట్టమొదటిసారిగా ప్రతిపాదించారు. తర్వాత 1926లో సి.పి. రామస్వామి ఆ ప్రతిపాదనను తిరిగి ముందుకు తెచ్చారు. 1947 తర్వాత స్వదేశీ పాలకుల హయాంలో, ముఖ్యంగా, హరిత విప్లవం ముసుగులో దేశంలోకి చొచ్చుకు వచ్చే, విస్తృతంగా నీటిని వినియోగించే హైబ్రిడ్ వంగడాల జలదాహాన్ని తీర్చే అవసరం ముందుకొచ్చింది. ఈ నేపథ్యంలో 1972లో సుప్రసిద్ధ ఇంజనీరు కె.ఎల్. రావు నదుల అనుసంధానం ప్రతిపాదనను మరిన్ని మార్పులు చేర్పులతో ముందుకు తెచ్చారు. 1973లో కె.జి. దస్తూర్ ఈ పథకం ఆమోదానికి ప్రయత్నం చేశారు. దాదాపు ఒకటిన్నర శతాబ్దపు చరిత్ర కల్గిన ఈ నదుల అనుసంధాన పథకాన్ని ప్రభుత్వం ఆమోదించేందుకు కమ్యూనిస్టు పార్టీలతో సహా అనేక రాజకీయ పార్టీల కృషి ఉంది. గత సంవత్సరం ఈ పథకంపై 185 నియోజక వర్గాలలో 'ఇండియా టుడే' నిర్వహించిన ప్రజాభిప్రాయ సేకరణలో 78 శాతం మంది ఈ పథకాన్ని సమర్థించారు. ఇండియన్ వాటర్ రిసోర్సెస్ సొసైటీ, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ లోని సివిల్ ఇంజనీర్లు ఈ మానవాద్భుతాన్ని సృష్టించేందుకు ఉవ్విళ్ళూరుతున్నారు. ఈ పథకం అమలుపై వేసిన ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని పరిశీలించిన సుప్రీంకోర్టు 2015 కల్లా ప్రధాన నదుల అనుసంధానం పూర్తికావాలని అక్టోబరు 31, 2002 నాడు కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. ది నేషనల్ వాటర్ డెవలప్‌మెంటు అథారిటీభారత ప్రధాన భూభాగంలోని 30 ప్రధాన నదులన్నింటినీ అనుసంధానం చేస్తూ ఒక జాతీయ నదీ గ్రిడ్‌ను ఏర్పాటు చేసే పథకాన్ని ప్రభుత్వానికి ప్రతిపాదించింది.

హిమాలయ నదులు, ద్వీపకల్పనదులు అనే రెండు రకాల నదులు మన దేశంలో ప్రవహిస్తున్నాయి. వర్షాకాలంలో కొద్ది రోజులలోనే 30 వేల నుండి 60 వేల క్యూసెక్కుల వరదనీరు (సెకనుకు క్యూబిక్ మీటరు నీరు) ఈ నదులలో ప్రవహిస్తుంది. ఈ వరద నీటిని కాలువల ద్వారా వివిధ జలాశయాలలో సేకరించి, దక్షిణ, పశ్చిమ, మధ్య భారతదేశంలోని దాహార్తితో ఉన్న పంట పొలాలకు, వేలాది కిలోమీటర్ల పొడవున్న కాలువల ద్వారా సాగునీటిని, తాగునీటిని అందించాలని ఈ పథకం లక్ష్యంగా ఉంది.

వేలాది క్యూసెక్కుల నీటిని వివిధ ప్రాంతాలకు తరలించడం ద్వారా ఉత్తరాదిన వరద బీభత్సాన్ని, దక్షిణాదిన నీటికొరత సమస్యను పరిష్కరించవచ్చనే పథకం సాంకేతిక అద్భుతంగా కన్పడుతోంది. 60 వేల క్యూసెక్కుల వరద నీటి ప్రవాహం నుండి కేవలం 4500 కూసెక్కుల నీటిని మాత్రమే వాస్తవంగా మళ్ళించగలమని నిపుణుల నుంచిత అంచనాలు తెలియజేస్తున్నాయి. ఇంత తక్కువ పరిణామం గల నీటి తరలింపు వరద సమస్యను ఏ మాత్రం పరిష్కరింప జాలదు సరికదా, సాగునీటి సమస్యను పరిష్కరించాల్సిన లక్ష్యాన్ని ఏ మాత్రం పరిపూర్తి చేయలేదు. వర్షాకాలంలో నదుల వరదనీరును, ఆయా నదుల పరీవాహక ప్రాంతాలలోని నీటి నిల్వల్ని అతిగా అంచనా వేయరాదు. గంగా పరీవాహక ప్రాంతంలోని జనావాసాలు వర్షాకాలంలో భయంకరమైన వరదలు, వేసవిలో భయంకరమైన తాగునీటి, సాగునీటి కొరతను చూస్తున్నాయి. ఇలాంటి పరిస్థితులలో నీటి తరలింపు అంతర్ గ్రామాల, అంతర్ ప్రాంతాల, అంతర్ రాష్ట్రాల, అంతర్ జాతీయ వివాదాలకు, వైషమ్యాలకు

దారితీస్తుంది. దేశంలోని, రాష్ట్రాల మధ్య జల వివాదాలను పరిష్కరించేందుకు అవసరమైన సమగ్ర జాతీయ జల విధానం కాని, అందుకు సహకరించే చట్టాలు గాని మనకు లేకపోవడంతో అనేక వ్యాజ్యాలలో ఈ పథకం ఇరుక్కుపోతుంది. ఈ విధమైన కేంద్రీకృత జాతీయ జల విధానానికి అనేక రాష్ట్ర ప్రభుత్వాలు తమ తమ రాజకీయ ప్రయోజనాల నేపథ్యంలో మోకాలడ్డడం ఖాయమనేది కూడ జగమెరిగిన సత్యమే.

బంగ్లాదేశ్‌లో ప్రవహించే 57 నదులలో 54 నదులు భారత్‌లో నుండే ప్రవేశిస్తాయి. అందులో గంగా, బ్రహ్మపుత్ర, మేఘన పరీవాహక ప్రాంతాలు బంగ్లాదేశ్ ప్రధాన నీటివనరులుగా ఉన్నాయి. ఈ నదుల నిరంతరాయ ప్రవాహం వలన, వానాకాలంలో సంభ

**భారత్ నదుల అనుసంధానం పథకాన్ని సవాల్ చేస్తూ మార్చి 2003లో నేపాల్, బంగ్లాదేశ్‌లు క్యోటోలో జరిగిన థర్డ్‌వరల్డ్ వాటర్ ఫోరంలో తీవ్ర అభ్యతరాలు లేవదీశాయి.**

వించే వరదల వలన నదీ ముఖద్వారాల వద్ద వొండ్రు పేరుకు పోకుండా ఉంటుంది. దాంతో జల రవాణా నిరాటంకంగా సాగుతుంది. అదే సమయంలో భూగర్భజాలలు ఒట్టిపోయి, సముద్రపు ఉప్పునీరు భూగర్భంలోకి చొచ్చుకొని రాకుండా నిరోధింపబడుతుంది - అలా జరగకపోతే 75 శాతం బంగ్లాదేశ్ భూగర్భజలాలు ఉప్పునీరుగా మారిపోతాయి. దాంతో మంచినీరు, మత్స్యసంపద ధ్వంసమైపోతుంది. వ్యవసాయం పూర్తిగా దెబ్బతినిపోతుంది. పర్యవసానంగా బంగ్లాదేశ్ ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నమై తాగునీరు, సాగునీరు కరువుకు, కూటి కరువుకు గురై ప్రజానీకం భయానక పరిస్థితులలోకి నెట్టివేయబడుతుంది. ఈ నేపథ్యం నుండి భారత్ నదుల అనుసంధానం పథకాన్ని సవాల్ చేస్తూ మార్చి 2003లో నేపాల్, బంగ్లాదేశ్‌లు క్యోటోలో జరిగిన థర్డ్‌వరల్డ్ వాటర్ ఫోరంలో తీవ్ర అభ్యతరాలు లేవదీశాయి. ఇప్పటికే ఫరక్కా బ్యారేజీలోని గంగానీటిని భారత్ 1996లో జరిగిన ఒప్పందానికి భిన్నంగా వాడుకోవడంతో నైరుతి బంగ్లాదేశ్ ప్రాంతంలోని భూగర్భ జలాలలో ఉప్పునీరు శాతం పెరిగిపోతోంది. ఒప్పందం ప్రకారం గంగానది నీటి సహజ ప్రవాహాన్ని భారత్ ఏవిధంగానూ ఆటంకపరచరాదు. ఇంకొకవైపు పాకిస్తాన్ సింధునది, దాని ఉపనదుల ప్రవాహాన్ని ఆటంకవరచకూడదనే ఒప్పందం ఉంది. అయితే నదుల అనుసంధాన పథకానికి కేంద్రంగా గల హిమాలయ, నది ప్రవాహాలకు ఎలాంటి ఆటంకాలు కల్గించకూడని పరిస్థితి ఉంది. దాంతో నదుల అనుసంధాన పథకం వల్ల అంతర్జాతీయ జల వైషమ్యాలకు తెర లేస్తుంది. నేడు దేశం వాటిని ఎదుర్కోగల్గే స్థితిలో లేదు.

రాజకీయ అవరోధాలను అధిగమించి వరద నీటిలో వాటాను సాధించినప్పటికీ పర్యావరణరీత్యా ఈ పథకం ప్రమాదకమైనదిగా నిలుస్తుంది. భారతదేశంలోని నదులలోని కాలుష్యాన్ని వదలగొట్టి శుద్ధి చేసేందుకు దేశ స్థూల జాతీయోత్పత్తికి మూడురెట్లు ఎక్కువ ఖర్చు అవుతుందని ప్రపంచబ్యాంకు అంచనా వేసింది. అంత ఘోరంగా మన దేశ నదులన్నీ కలుషితమై ఉన్నాయి. పవిత్రమైనట్టి, పాప వినాశకారైనట్టి గంగానది దేశంలోనే అత్యంత ప్రమాదకరమైన స్థాయిలో కలుషితమైనది. ఈ నదిని శుద్ధి చేసేందుకు గంగా యాక్షన్ ప్లాన్ కొరకు కోట్లాది రూపాయలను వెచ్చించినప్పటికీ ఎలాంటి ప్రయోజనం లేకపోయింది. ఇలాంటి పరిస్థితులలో నదుల నీటి అనుసంధానంతో మిగతా అన్ని నదుల బేసిన్‌లు సైతం కలుషితమైపోతాయి. అదే సమయంలో ఆయా నదుల సహజ శుద్ధి క్రమాన్ని కలుషిత గంగానదీ జలాలు ధ్వంసం చేస్తాయి. మనకు ఒక్క గంగానదీ జలాలనే శుద్ధి చేయలేని అశక్తత ఉంటే, ఈ నదుల అనుసంధాన పథకం ద్వారా దేశంలోని అన్ని నదులను కలుషితం విషపూరితం చేయడం భావ్యమా? దాంతో ప్రజల మనుగడే ప్రశ్నార్థక మవుతుంది.

ఈ కలుషిత జలాల అనుసంధానం వలన తాగునీటి సమస్య పరిష్కారం కాకపోగా భూగర్భజలాలు సైతం కలుషితమై ప్రజా ఆరోగ్యం సంక్షోభంలో పడుతుంది. అదే సమయంలో ఆ నీటిలోని హానికరమైన పదార్థాల కారణంగా పంటలు పండకపోవడం, పంటలు కుళ్ళిపోవడం జరుగుతుంది. భూములు సహజ సారాన్ని కోల్పోయే ప్రమాదముంది. ఆయా నదుల పరీవాహక ప్రాంతాలలోని వృక్ష జాలం, జంతుజాలంతో నహా స్థానిక జీవజాలం అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఆయా నదుల వైవిధ్య భరిత మత్స్య సంపద అంతరించిపోతుంది. మొత్తంగా స్థానిక జీవ వైవిధ్యం యొక్క ఉనికి ప్రమాదంలో పడుతుంది. వరదనీటి ప్రవాహం సముద్రంలో కలిసే ప్రాంతాలలో ఒండ్రు పేరుకుపోవడంతో అనేక నదుల సహజ ప్రవాహ క్రమం దెబ్బతిని పోయి, కొత్త ప్రాంతాలలో వరద ప్రమాదాలు సంభవిస్తాయి. అదే విధంగా తగినన్ని మంచినీటి జలాలు సముద్రంలో కలువకపోవడంతో సముద్ర తీర ప్రాంతాలలో బ్రాకిష్ వాటర్ ఆధారంగా జరిగే అనేక జీవుల పునరుత్పత్తి, ప్రత్యుత్పత్తి ప్రక్రియలు దెబ్బతిని ఆయా జలచర జీవజాతులు అంతరించిపోవడంతో లక్షలాది మంది మత్స్యకారులు జీవనం కోల్పోతారు. అదే సమయంలో సముద్ర తీరంలోని భూగర్భ జలాలలోకి క్రమంగా ఉప్పునీరు చొచ్చుకొనివచ్చి, కోట్లాది మంది ప్రజలకు తాగునీటి సమస్య తీవ్రరూపంలో ముందుకొస్తుంది.

**జాతీయ జల అభివృద్ధి అథారిటీ ఈ నదుల అనుసంధానం ప్రాజెక్టుకు 5,60,000 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేసింది. అయితే ప్రాజెక్టు నిర్మాణం పూర్తయ్యేసరికి 10 లక్షల కోట్ల రూపాయలు ఖర్చవుతుందని నిపుణులు అంచనా వేశారు. భారతదేశ విదేశీ అప్పుకు ఈ ఖర్చు రెట్టింపు ఉంటుంది.**

ఈ ప్రాజెక్టులో వేలాది కిలోమీటర్ల పొడవున కాలువల్ని, 200 దాకా నీటిని నిల్వ చేసే డ్యాములను నిర్మించాల్సి వుంది. ఈ నిర్మాణాల కొరకు దాదాపు 4 1/2 లక్షలమంది గిరిజన, వెనుక బడిన తరగతుల ప్రజలు నిర్వాసితులవుతారు. ఇప్పటివరకు భారత దేశ చరిత్రలోని ఏ ప్రాజెక్టు కింద ప్రజలు నిర్వాసితులైనప్పటికీ సరైన పునరావాస కార్యక్రమానికి నోచుకోలేదనేది జగమెరిగిన సత్యం. పునరావాసాల కొరకు జరిగిన అనేక పోరాటాలను ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. సంస్కృతిని, జీవనాన్ని, ఆవాసాలను కోల్పోయిన కోట్లాదిజనం అమానవీయ పరిస్థితులలో దుర్భరంగా బతుకుతున్నారు. ఆర్థికాభివృద్ధి పేరు మీద మనుషుల జీవితాల్ని ఫణంగా పెట్టకూడదనే అంతర్జాతీయ చట్టమున్నప్పటికీ, ప్రపంచ బ్యాంకు నిర్దేశానుసారం నర్మదా ప్రాజెక్టు లాంటి అనేక ప్రాజెక్టులలో జనం నిర్దాక్షిణ్యంగా గెంటివేయబడ్డారు. అంతర్జాతీయ శ్రామిక సంస్థ 107 కన్వెన్షన్‌లో గిరిజన, అర్థ-గిరిజన ప్రాంతాల్ని, మూల వాసుల నివాస ప్రాంతాల్ని, వారి హక్కుల్ని పరిరక్షించాలి. భారత రాజ్యాంగం 51 వ ఆర్టికల్‌లో సైతం పై విధమైన హక్కుల్ని గుర్తించి నప్పటికీ, వేలాది కోట్ల రూపాయల లాభార్జన కత్తివేటుకు గురికాక తప్పలేదు. నదుల అనుసంధాన ప్రాజెక్టు నిర్వాసితులకు కూడా ఇదే గతి పడుతుంది. అదే సమయంలో 79 వేల హెక్టార్ల అడవి నాశనమవుతుంది. దీనికి పరిహారంగా ప్రభుత్వ భూమి ఎన్ని హెక్టార్లు కేటాయించి, సామాజిక అడవుల పెంపకం చేపట్టినప్పటికీ సహజసిద్ధంగా ఉండే జీవ వైవిధ్యాన్ని, పర్యావరణాన్ని తీసుకు రాలేము.

జాతీయ జల అభివృద్ధి అథారిటీ ఈ నదుల అనుసంధానం ప్రాజెక్టుకు 5,60,000 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేసింది. అయితే ప్రాజెక్టు నిర్మాణం పూర్తయ్యేసరికి 10 లక్షల కోట్ల రూపాయలు ఖర్చవుతుందని నిపుణులు అంచనా వేశారు. భారతదేశ విదేశీ అప్పుకు ఈ ఖర్చు రెట్టింపు ఉంటుంది. విదేశీ అప్పుకు వడ్డీ కట్టేందుకు మళ్లీ అప్పు తీసుకోవాల్సిన దుర్భల పరిస్థితిలో ఉన్న మనదేశం ఈ ప్రాజెక్టు కొరకు ఇతర దేశాల నుండి అప్పు తేవలసిందే తప్ప వేరే మార్గంలేదు-భారత పారిశ్రామిక వర్గం ఆ స్థాయి సాంకేతిక సామర్థ్యంగాని, మదుపు సామర్థ్యంగాని లేనిది. విదేశీ అప్పుతో ఈ ప్రాజెక్టు నిర్మాణం చేపడితే, దానిపై ఆధారపడి తమ ఆర్థిక కార్యకలాపాలు ఎలా నిర్వహించాలో స్వదేశీ పారిశ్రామికులు అప్పుడే వ్యూహాలు రూపొందించే పనిలో ఉన్నారు. ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చాంబర్స్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ వారు తమ లాభాల వాటాల్ని అంచనాలు వేస్తున్నారు.

19వ శతాబ్దం మధ్యకాలం నాటికే కాటన్ ద్వారా ప్రతిపాదించ బడిన ఈ పథకం ఇప్పటికీ అమలులోకి రాకపోవడానికి బలమైన భౌగోళిక రాజకీయాలున్నాయి. తమలాగే ఆంగ్లో సాక్సన్ జాతీయుల చేతిలోని (అమెరికా ఆస్ట్రేలియా) వ్యవసాయోత్పత్తులు ప్రపంచ మార్కెట్‌లో తగినంత దొరికినంత కాలం భారత దేశ వ్యవసాయ రంగాన్ని కేవలం నల్లమందు, నీలిమందు పంటల సాగుకు మాత్రమే బ్రిటిష్‌వాళ్లు బలవంతంగా నెట్టారు. అమెరికాలో కొన్ని సంవత్సరాల పంటల ఉత్పత్తి పడిపోయింది. దాంతో బ్రిటిష్‌వారు భారతదేశంలోని రైతాంగాన్ని ప్రత్తి పంట పండించేందుకు ప్రోత్సహించారు. కొంత కాలానికి ఆంగ్లో సాక్సన్ జాతీయులైన అమెరికా వ్యవసాయోత్పత్తి పెరగడంతో బ్రిటిష్‌వారు భారత్ వ్యవసాయోత్పత్తులను కొనకపోవడంతో భారత రైతాంగం సంక్షోభంలో కూరుకుపోయింది. భారతదేశంలో చెరకు, ప్రత్తి వంటి పంటల్ని ప్రోత్సహిస్తున్న మొదటి దశలో బ్రిటిష్‌వారు సాగునీటికై వేసిన ప్రణాళికల రూపకల్పనలో భాగంగా ఈ నదుల అనుసంధాన పథకం బయటకొచ్చింది. తిరిగి అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తుల సంక్షోభం సమయంలో సంక్షోభ పరిష్కారంగా ఆ అనుసంధాన పథకం బట్టదాఖలైంది.

ప్రపంచ మార్కెట్ ఆవిర్భావంతోనే పెట్టుబడిదారీ సమాజం ఉదయించింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు కేంద్రంగా ఉత్తరార్థగోళ పారిశ్రామిక దేశాలుంటే, ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు పొలిమేరగా దక్షిణార్థగోళ వ్యవసాయక దేశాలున్నాయి. ఆర్థిక వ్యవస్థకు కేంద్రంగా ఉన్న ఉత్తరార్ధ గోళపు దేశాలలో పెట్టుబడి కేంద్రీకరణ, భూ కేంద్రీకరణ, అదనపు విలువ కేంద్రీకరణ, ద్రవ్య సంపద కేంద్రీకరణ క్రమం సాగుతూ ఉంటే, పొలిమేర దేశాలలో ఇందుకు పూర్తి భిన్నమైన వికేంద్రీకరణ క్రమాలు కొనసాగాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కేంద్రంలో వ్యవసాయోత్పత్తుల అధికోత్పత్తి కారణంగా, పొలిమేర ప్రాంత దేశాలలో వ్యవసాయం నిర్లక్ష్యం చేయబడింది. వ్యవసాయోత్పత్తి పెరిగేందుకు ముందు షరతుగా నిలిచే సాగునీటి వనరుల కేంద్రీకృత అజమాయిషీ అవసరం. ఈ నేపథ్యం నుండి దేశ వ్యవసాయోత్పత్తిని గణనీయంగా పెంచే సమగ్ర కేంద్రీకృత

జల విధానానికి సమగ్ర రూపమైన నదుల అనుసంధాన పథకం ఇన్ని సంవత్సరాలుగా నిర్లక్ష్యం చేయబడింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు కేంద్రంగా ఉన్న దేశాలలో వ్యవసాయోత్పత్తుల ఉత్పాదకత పడిపోవడం, అనేక పర్యావరణ సమస్యలు రావడం కారణంగా, పొలిమేర దేశాలలో ప్రత్యామ్నాయంగా వ్యవసాయోత్పత్తి పెంచేందుకు కేంద్ర ప్రాంత దేశాలు ప్రపంచ వాణిజ్య సంస్థ ద్వారా ప్రయత్నం చేస్తున్నాయి. అందులో భాగంగా హరిత విప్లవాన్ని మనలాంటి దేశాల పైకి ఎగదోలాయి. ఈ హరిత విప్లవంలో వాడబడే అధికోత్పత్తినిచ్చే హైబ్రిడ్ వంగడాలతో సేద్యం చేయాలంటే చాలానీరు అవసరం. లేకపోతే తెగుళ్లు విజృంభిస్తాయి. అదే సమయంలో చిన్న కమతాల స్థానంలో పెద్ద కమతాలు అవసరం. సమృద్ధ జల వినియోగం సాగాలి. ప్రభుత్వం ఒకవైపు పెద్ద కమతాలు ఏర్పడేందుకు కాంట్రాక్టు వ్యవసాయం, కార్పోరేట్ వ్యవసాయం రూపంలోని భూకేంద్రీకరణ, భూసంస్కరణలు చేపడుతోంది. రెండోవైపు పుష్కలంగా జలవినియోగం కోసం నదుల అనుసంధాన పథకం చేపడుతోంది. ఈ ద్విముఖ కార్యక్రమానికి విదేశీ బహుళ జాతి సంస్థలే ప్రధాన సూత్రధారులు. మన పాలకులు, ప్రభుత్వ పారిశ్రామికులు వగైరాలు కేవలం పాత్రధారులు మాత్రమే. ఇందులో ప్రజలు బలిపశువులుగా మిగులుతారు.

ప్రపంచ వాణిజ్య సంస్థ నిర్వచనాల ప్రకారం మానవ అవసరాలను వ్యాపార సరుకులుగా మార్చవచ్చుగాని, మానవ హక్కులను వ్యాపార సరకులుగా మార్చకూడదు. దాంతో అనేక బహుళజాతి సంస్థలు కుట్రతో నీటిని మానవహక్కుగా కాక మానవ అవసరంగా ఐక్యరాజ్య సమితి ద్వారా తీర్మానం చేయించారు. దాంతో ప్రపంచ నీటి వ్యాపారం అంతర్జాతీయ గుత్త సంస్థలకు కోటాను కోట్ల లాభాన్ని చేకూరుస్తున్నది. మానవుల హక్కుగా ఉండాల్సిన నీరు కుట్రల వలన మార్కెట్ సరుకుగా మారిపోయింది. దాంతో ప్రపంచ నీటి వనరులపై స్థానిక ప్రజల ఉమ్మడి హక్కు కాలరాయబడి, బహుళ జాతి సంస్థల గుత్తాధిపత్యం చోటు చేసుకుంటుంది. ఆ క్రమంలోనే ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం 23.6 కిలోమీటర్ల పొడవునా శివనాథ్ నదీ ప్రాంతాన్ని అమెరికాకు చెందిన రేడియస్ వాటర్ ఇన్‌కార్పోరేషన్ అనే సంస్థకు ధారాదత్తం చేసింది. కేరళలోని భరత్‌పూర్, పెరియార్ నదులు ఛత్తీస్‌గఢ్‌లోని కెటోనది ప్రైవేట్ సంస్థలకు ధారాదత్తం చేయబడ్డాయి. ఆ ప్రాంతంలో నాగరికత ఉద్భవించిన కాలం నుండి ఆయా నదులపై ఆయా ప్రాంత ప్రజలకు గల హక్కులన్నీ కాలరాయబడి, బహుళజాతి సంస్థల దయాదాక్షిణ్యాలపై దోపిడికి గురై బతకాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ నేపథ్యం నుండి చూస్తే నదుల అనుసంధాన పథకం ప్రయోజనం ప్రజలకు ఏపాటిదో, అది ఎవరి జేబుల్లోకి వెళుతుందో అర్థమవుతుంది.

పది లక్షల కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించే ఈ అనుసంధాన పథకం ద్వారా వ్యవసాయోత్పత్తి పెరగడం మాట అటుంచి, ఉన్న ఉత్పాదకత కూడా కోల్పోయి, అప్పు తీర్చేందుకు మన సహజ సంపదలు, శ్రమశక్తిని తెగనమ్ముకోవాల్సి వస్తుంది. తీవ్రమైన సామాజిక, ఆర్థిక, పర్యావరణ విధ్వంసాలను భారత ప్రజలు ఎదుర్కోవల్సి వస్తుంది. నదుల అనుసంధానం పథకం రాజకీయంగా తెలివిమాలిన చర్య; ఆర్థికంగా దివాళా కోరు చర్య; పర్యావరణ పరంగా విధ్వంసకరమైన చర్య.

సమగ్రమైన కేంద్రీకృత వ్యవసాయ విధానాన్ని స్థానిక అవసరాలను తీర్చే స్వభావం తోను, స్థానిక చొరవను, సృజనాత్మకతను పెంచేది గాను, ప్రజల ఉమ్మడి భాగస్వామ్య ప్రాతిపదికతోను రూపొందించేందుకు సమగ్రమైన కేంద్రీకృత జలవిధానం రూపొందించి, వివిధ చెరువులు, కుంటలు, చెక్‌డ్యాంలు లాంటి వికేంద్రీకృత స్థానిక వర్షపు నీటి సాగు విధానాన్ని చేపట్టాలి. ప్రాంతాల స్థానిక తత్వాన్ని బట్టి ప్రజలకు పంట సాగును సూచించడం, భూగర్భ జలాల పరిమాణాన్ని బట్టి పంటలను సాగుచేసే విధానాన్ని నిర్ణయించడం వంటి చర్యలు చేపట్టాలి. జాతీయ, అంతర్జాతీయ మార్కెట్ అవసరాలను బేరీజు వేసి, ఒక సమగ్ర వ్యవసాయ ప్రణాళికను రూపొందించాలి. హరిత విప్లవపు హైబ్రిడ్ విషం నుండి ప్రజల్ని సేంద్రియ, సహజ, శాస్త్రీయ, వ్యవసాయం వైపు మళ్లించాలి. నీటిని విపరీతంగా వినియోగించే వరి, చెరుకు వంటి పంటల్ని అవసరాలకు మించి సాగుచేసి, భూగర్భ జల నిల్వల్ని కొల్లగొట్టే చర్యలను సంయమనంతో నియంత్రించాలి. అభివృద్ధి చెందిన దేశాలలోవలె వ్యవసాయోత్పత్తులకు తగిన ఆర్థిక లాభం చేకూరే విధంగా తగిన సబ్సిడీలు, మార్కెట్ నియంత్రణ వంటి ప్రభుత్వ విధానాలు ఉండాలి. అందుకు భిన్నంగా భారత దేశ ప్రజలను సామాజిక, ఆర్థిక, పర్యావరణ, దోపిడీకి గురిచేసే, భారత ప్రజలను ఉత్తరార్థగోళ పారిశ్రామిక దేశాల బహుళ జాతి సంస్థల తోడేళ్ళకు ఆహారంగా వేసే ఈ బృహత్తర నదుల అనుసంధాన పథకాన్ని ప్రజలంతా మూకుమ్మడిగా తిప్పికొట్టాలి. ❑

# అధికారం హద్దులు మీరిన చోట ప్రజాస్వామ్యం ఆశించడమా?

-పరమేశ్వర్

*(వీక్షణం మార్చి 1-31 సంచికలో అచ్చయిన నెల్లూరి కృష్ణమూర్తి వ్యాసం 'నక్సలైట్ ఉద్యమం-కొన్ని ఆలోచనలు' చాల చర్చకు దారి తీసింది. ఆ వ్యాసానికి ప్రతిస్పందనగా వచ్చిన చర్చా వ్యాసాల నుంచి రెండింటిని ఈ సంచికలో అచ్చు వేస్తున్నాము.-సంపాదకుడు)*

గత కొద్ది రోజులుగా వరుసగా జరుగుతున్న ఎన్‌కౌంటర్లపైన పోలీసు పెద్దలు అనేక ప్రకటనలు విడుదల చేస్తున్నారు. కరీంనగర్, వరంగల్, ఖమ్మం, ప్రకాశం, గుంటూర్ ఎస్.పి.లు, డి.జి.పి పత్రికా విలేఖరుల సమావేశాలలో అనేక హెచ్చరికలు మావోయిస్టులకు చేస్తున్నారు. గడిచిన కొద్ది రోజులుగా తాము జరిపిన అనేక దాడులలో ముఖ్యమైన డాక్యుమెంట్లు, ఆయుధాలు, ప్రేలుడు పదార్థాలు, ల్యాండ్ మైన్స్‌లే కాకుండా ఎంతో కీలకమైన సమాచారం దొరికిందని టివిలలో ఆధారాలుగా చూపుతున్నారు. సాధారణ విషయాలుగా మారిన వాటి పైన కూడా కథలల్లి ప్రచారం చేస్తున్నారు. దీనికంతా హంగులు, ఆర్భాటాన్ని సమకూర్చి ఈ ప్రచార విధానానికి సర్టిఫికేట్స్ ఇస్తున్నారు హోంశాఖామాత్యులు, ముఖ్యమంత్రిగార్లు.

రెండో విడత చర్చల కోసం కేబినెట్ తీర్మానించిందని ప్రకటించారు. వెనువెంటనే జరుగుతున్న ప్రెస్ బ్రీఫింగ్‌లలో కేబినెట్ మంత్రులంతా ఒక విడత కాకుంటే పది విడతలైనా మాట్లాడుతాం అని వాదనలు చేస్తున్నారు. ఇక టి.ఆర్.ఎస్ నాయకులు సోనియా మొదలు ప్రధాని వరకు అందరిని కలిసి కేంద్ర జోక్యం ద్వారా పరిస్థితిని చక్కదిద్దుతామంటున్నారు. చంద్రశేఖరరావు గారు ఢిల్లీలో ఒకటే కసరత్తు చేస్తున్నారు. టి. అర్. ఎస్. ఎమ్.ఎల్.ఎ లు ఇక్కడ హైదరాబాద్‌లో వై.ఎస్.ఆర్ నే కాదు మరెందరినో కలిశారు. కాంగ్రెస్ సీనియర్ నాయకులు వెంకటస్వామి, సత్యనారాయణ, శ్రీనివాస్, ఒకరేమిటి అనేకులు బహిరంగంగానే సెలవిస్తున్నది మావోయిస్టులపై దాడి మానుకొమ్మని. ఇదంతా రహస్యంగా జరుగుతున్నదని ఈ రోజు రేడియో, పేపర్, టివి చూసేవారు వినేవారు ఎవరూ అనుకోవడం లేదు. అంతా అందరి ముందే జరుగుతున్న ఒక దాడిపై మరో దాడి, ఒక మరణం వెన్నంటి మరో మరణం జరిగిపోతున్నందునే ఇక మేం చర్చలలో పాల్గొని ఉపయోగం లేదని మావోయిస్టులు ప్రకటించారు. ప్రతిఘటన ప్రారంభించారు. ప్రతిఘటన ఇప్పటికి చెదురు మదురు చిన్న చితకా ఘటనలుగానే వుంది.

అయుధాలతో అడవుల్లో వుండమన్నాం. వరంగల్‌లో అడవిలో వున్న క్యాంపు పైన దాడి ఎందుకు చేయాల్సి వచ్చిందని దేవాదాయ శాఖామాత్యులు సత్యనారాయణరావు గారు అడిగారు. జవాబుగా సిఎం ఏం చేయాలో చెప్పండి ప్రశ్నించడం కాదన్నారు. కాని సత్యనారాయణ గారు ఏం సలహాలు ఇచ్చారో సిఎం ఏం విన్నాడో కాని ఎస్.పి లంతా చెప్పుతున్నారు ఏ విచారణకైనా సిద్ధం అని వారు ఏ తప్పు చేశారని నేను భావించడం లేదని ఆంధ్రప్రదేశ్ 'రారాజు' కుండబద్దలు కొట్టినట్లు చెప్పాక ఇక వాదవివాదాలు ఏ విషయంపై జరపాలి మనం? ఇపుడు రెండు పక్షాలు తమ వైఖరులు స్పష్టం చేసి చర్చల నుండి వైదొలగాలి. మావోయిస్టులు స్పష్టంగా పారదర్శకంగా తమ వైఖరి చెప్పి చేస్తున్నారు. పాలకులు ఎప్పటిలాగానే చాపక్రింది నీరులా నర్మగర్భితంగా అశ్వత్థామా...హతః...కుంజర అన్న రీతిలో 'రాజకీయం' సాగిస్తున్నారు. కనుక అసలు విషయం ఏమిటో మనమైనా ప్రజల ముందు స్పష్టంగా చెప్పక తప్పదుమరి.

ఏ జిల్లాలోనూ పోలీసు అధికారులు ప్రభుత్వం మాట వినకుండా, సంయమనం పాటించకుండా పకడ్బందీగా బలగాలను మోహరించి దాడి చేస్తున్న విషయంగా చూపడంలోనే ప్రజలను మోసగించడం వుంది. కొద్దిరోజుల క్రితం ఎవరు ఎవరిని నడిపిస్తున్నారనే ప్రశ్న కూడ ముందుకు వచ్చింది. ప్రభుత్వం చిత్తశుద్ధితో వ్యవహరించాలనే ప్రకటనలు వచ్చాయి. ఈ అవగాహన అంతా వర్గాలు, వర్గయుద్ధాలు గురించి లేదా చరిత్ర గురించి తెలియని వారు మాట్లాడుతున్నది కాదు. అంతా తెలిసి జరుగుతున్న చర్చ.

ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు దేశవ్యాప్తంగానే వర్గయుద్ధం బద్ధలై కొనసాగుతున్న విషయం అందరం ఎరిగినదే. ఏ సిద్ధాంతం పనికి రానిదై పోయింది? పెట్టుబడిదారీ విధానమా? కమ్యూనిజమా? అనే చర్చ కూడా గడిచిన వందేళ్లుగా జోరుగా చర్చ జరుగుతున్న అంశమేగా మరి. అయినా రెండు సమాజాలు కొద్దికాలం క్రితం వరకు మన గలిగాయి. ఇపుడు ఏ శక్తికి ఆ శక్తి తన జవసత్వాలు కూడ దీసుకోవడానికి ప్రయత్నిస్తూనే వున్నాయి. మరోసారి ప్రపంచం అంతా ముఖా ముఖి ఈ రెండు వర్గాలు మరింతగా

ఢీకొనే దిశగా అడుగు వేస్తున్నది. అందుకే స్టాలిన్ వందేళ్ల క్రితం ఇలా అన్నాడు "ప్రస్తుత సమాజం రెండు పెద్ద శిబిరాలుగా విడిపోయింది. ప్రతి శిబిరం ఒక ప్రత్యేక వర్గానికి సంబంధించింది. వాటి మధ్య విజృంభిస్తున్న వర్గపోరాటం విస్తరిస్తోంది. రోజు రోజుకూ తీవ్రతరమవుతోంది. మిగిలిన బృందాలన్నీ ఈ రెండు శిబిరాల చుట్టూ సంఘటితమవుతున్నాయి".

ఆంధ్రప్రదేశ్‌లో ఇపుడు జరుగుతున్న చర్చలు రెండు వైరి వర్గాల మధ్య. ప్రపంచ చరిత్రలో ఇలా రెండు వైరివర్గాలు అనేక సందర్భాలలో చర్చలు జరిపాయి. వెనక్కుతగ్గాయి. రాజీలకు అంగీకరించాయి. అయితే ఇదంతా తాత్కాలికమే. ఎందుకంటే ఈ రెండు ఒక దానిని మరోటి నిర్మూలించుటకు కేవలం సైద్ధాంతికంగా, రాజకీయంగా సిద్ధమై యుద్ధం ద్వారానే పరిష్కరించుకొనుటకు సిద్ధమైనవి. ఇదంతా అందరు ఎరిగినదే. అయినప్పటికీ తాత్కాలికమే అయినా విరామం ఇరు వర్గాలు కోరుకున్నాయి. అందుకనే మైనర్ ఘటనలు ఒకటి అరా జరిగినా మొత్తానికి ఓ ఆరు మాసాలు పెద్ద ఘటనలు ఒక దాని వెన్నంటి మరోటి జరుగలేదు. ఇప్పుడే ఎందుకు జరుగుతున్నాయి? ప్రభుత్వం దాని నాయకుడు రాజశేఖరరెడ్డి గారు ఒక్కో ఎత్తుగడను ముందుకు పెట్టి 'శాంతి చర్చలు' అనే ఈ నాటకం మంచి రక్తి కట్టించడంలో తెరముందు, తెర వెనుక పావులను కదపడంలో నాయుడుకు మించిన కసరత్తు చేస్తున్నాడు. ఇదంతా సోనియా, మన్‌మోహన్ తదితర కాంగ్రెస్ దిగ్గజాల గైడెన్స్‌లోనే అనే విషయం కూడా ఇక్కడ తప్పక మన మనసులో వుంచుకోవలసిందే. మావోయిస్టులు కూడా తమ పిబి, సిసిలతో సంప్రదించకుండా కేవలం ఒక రాష్ట్రానికి సంబంధించిన విషయంగా చూస్తున్నారని ఎవరమైనా అనుకోగలమా? రెండు వర్గాలు తమ తమ రాష్ట్ర, కేంద్ర కమిటీల అభీష్టం మేరకే కదులుతున్నారనేది నిజం.

అధికారంలోకి వచ్చే వరకు కేవలం ప్రచార ఆయుధాన్నే చేపట్టి దానిని పొడిగించనంత కాలం నిర్దిష్ట హామీలు లేకుండా పొడిగించారు రెడ్డి గార్ల త్రయం. దీనికంతా చట్టపర సమస్యలు, పోలీసులలో చర్చల వ్యతిరేక సెక్షన్‌ను కన్విన్స్ చేయడం పేర సాగదీశారు. తప్పని పరిస్థితిలో మొదటి విడత జరిపారు. అప్పటి వరకు ఓ రెండు మాసాలు పరిమితంగానే అయినా సభలు జరగనిచ్చారు. ఇది మొదటి ఘట్టం. చర్చలు ముగిసీ ముగియగానే ఇక రెండవ ఘట్టం ప్రారంభమైంది. 144 సెక్షన్లు, సభలను భగ్న పరచడం, అరెస్టులు, కేసులు బెదిరింపులు, సమాచార సేకరణ, బలగాల తర్ఫీదు, కోవర్ట్/ఇన్‌ఫార్మర్ యంత్రాంగాన్ని పటిష్ట పరచుకోవడం, బలగాలకు విరామం, స్వంతపార్టీని బలోపేతం చేసుకోవడం, తన ప్రధాన ప్రత్యర్థి టిడిపి పై భౌతిక దాడితో సహా అన్నింటినీ ఒక దానితో మరో దానిని సమన్వయించుకుంటూ ముఖ్యమంత్రి తన చక్రం తిప్పాడు. ఇదంతా రెండవ ఘట్టంగా చూడవచ్చు మనం. ఇదో రెండు నెలలు వుండింది. ఇక ఇప్పుడు మూడవ ఘట్టం ప్రారంభించాలి. ఇది బూటకపు ఎన్‌కౌంటర్లు గ్రేహౌండ్స్ దళాల కవ్వింపు దాడులతో ఊరు-అడవి దద్దరిల్లింది. ఈ ఘట్టంలో ప్రచారం కూడా అఫెన్సివ్‌గా జరిపారు.

వాస్తవం ఇది కాగా లంచాలకు రుచిమరిగిన పోలీసు అధికారులు, చర్చల ప్రక్రియకు విఘాతం కల్గిస్తున్నారనే ఓ ప్రచారం బలం పుంజుకున్నది. నక్సలైట్ల హింస పెట్రేగిపోయిందని పోలీసుల, సియం, హోంమినిష్టర్ల ప్రకటనలు. దీనికి తోడుగా ఆయుధం విడనాడితేనే చర్చలు అంటూ మొదటి విడత నుండి పెద్ద ప్రచారం ప్రభుత్వం ప్రారంభించింది. ఇక అర్ధబలం, కేడర్ బలం, తుపాకీ బలం పెద్ద ఎత్తున పెంచుకుంటున్నారు మావోయిస్టులు అనే మరో ప్రచార యుద్ధాన్ని ఒక క్రమ పద్ధతిలో పోలీసు యంత్రాంగం ద్వారా వై.ఎస్.ఆర్ చేపట్టాడు. నిజానికి జయలలిత నిషేధం ఎత్తివేసినపుడు వైఎస్ఆర్ ప్రభుత్వాన్ని తప్పు పడితే 'మాదంతా వెల్ కాలిక్యులేటెడ్ మూవ్' అంటూ జవాబు చెప్పారు సిఎమ్. ఇది ఎంతమంది దృష్టిని ఆకర్షించిందో గానీ ఒక పథకం ప్రకారంగానే పై నుండి అంతా జరుగుతున్నదని మనం గమనించాలి. ప్రజలకు చెప్పాలి. ఇదే మావోయిస్టులకు వర్తిస్తుందని చెప్పడంలో కూడా మనకు వెనకా ముందు అవసరం లేదు. ఎవరికి వారు ఈ కాలం బలపడుటకు విరామం కోరుకున్నారనేది అది తప్పుకాదనే వాదనలు కూడా అన్ని సెక్షన్ల నుండి మీడియా నుండి కూడా ముందుకు వచ్చాయి. అందువల్ల మావోయిస్టులు బలపడినారనే వాదం అర్థరహితం.

'చర్చలకు సిద్ధం', 'ధీటుగా ఎదుర్కొంటాం', 'మావోయిస్టుల హింసను సహించం', ఈ మూడు విషయాలపై వాదనలు ఎ.పి. అంతటా వినవస్తూ వున్నాయి. ఇందులో చర్చలకు సిద్ధం అనే దానిలో అర్థం లేదిపుడు. ఒక పక్షం బహిరంగంగా, మరోపక్షం నర్మగర్భంగా ప్రకటించి తన ఆచరణ ద్వారా చర్చల ప్రక్రియనుండి వైదొలగింది. ఇక ధీటుగా ఎదుర్కొంటాం అనే పోలీసు యంత్రాంగం హెచ్చరికలను, కార్యక్రమాన్ని తక్కువ చేసి చూడరాదు. ఎందుకంటే ఎత్తుగడల పరంగా 1999 నుండి మావోయిస్టులపై ఆధిక్యత సంపాదించిన పోలీసులు ఈ ఆర్నెల్లలో మరింత జవసత్వాలు పుంజుకున్నారే తప్ప బలహీన పడలేదనేది వాస్తవం. బడ్జెట్, యంత్రాంగం, సాధనా సంపత్తి, తర్ఫీదు మెరుగు పడింది. రాష్ట్రంలోనూ-కేంద్రంలోనూ, ఏకపార్టీ పాలన కూడా కాంగ్రెస్ వారికి కలసి వచ్చింది. ఎన్‌డిఎ ప్రభుత్వం కొనసాగించిన విధానపర నిర్ణయాలు ఉల్లంఘించడం కాదు, మరింత వేగంగా కాంగ్రెస్

నాయకత్వంలోని యుపిఎ అమలుపరుస్తున్నది. 50 వేల కొత్త పారామిలటరీ బలగం ప్రత్యేకించి మావోయిస్టుల కోసం పురుడు పోసుకున్నది. రాష్ట్ర, కేంద్ర సమన్వయం పెరిగింది. గూఢచార యంత్రాంగం పెరిగింది. దాడి అని చెప్పకుండానే టిడిపికి ముందు కాంగ్రెస్ కొనసాగించిన అప్రకటిత దాడికి శ్రీకారం చుట్టారు వై.ఎస్.ఆర్, జానాలు. అందువల్ల దాడి తీవ్రత అధికంగానే వుంటుందనే విషయంలోనూ మావోయిస్టులు దెబ్బ కాచుకోవడం లోనే అధిక సమయం ఇవ్వాల్సి వస్తుందని ఆత్మరక్షణా యుద్ధంలో అందు లోనూ బలహీన స్థితికి నెట్టబడిన తన శక్తిని కూడగట్టు కోవడంలో తొందరపాటు, చేసిన తప్పులే చేయకుండా వుండాలన్నా సమయం పడుతుంది. అందువల్ల హెచ్చరికలను తోసి పుచ్చకుండా స్వీకరిం చాలి. ప్రత్యామ్నాయ ఎత్తుగడలు సరిగా వేయాలిపుడు.

ఇక మావోయిస్టుల పెట్రేగిన హింస అనేది ఇంకా విధ్వంసం స్థితికి చేరలేదు. ఇటీవల సాగినది ఆరునెలల క్రితం ఎక్కడ వదిలేయబడిందో అక్కడి నుండే ప్రారంభమైన బలహీనమైన ఆత్మరక్షణగానే వుంది తప్ప ప్రభుత్వం ప్రచారం చేస్తున్నట్లు దాడి తీవ్రతలో ఇంకా గుణాత్మకమైన మార్పుగానీ గమనించదగిన మార్పు కానీ వచ్చిన దాఖలాలు లేవు. అయితే ప్రజలు రాజకీయంగా మావోయిస్టులను ఒక శక్తిగా చూస్తున్నారు. రెండు విప్లవ పార్టీల ఐక్యత, కొత్త డాక్యుమెంట్లు అంటే రాజకీయ పంథాలో వచ్చిన స్పష్టత, ఐక్యత నిస్సందేహంగా దేశంలో మావోయిస్టుల శక్తిని పెంచింది. అందుకే మార్క్స్ చెప్పినట్లు "బూర్జువాల ఐక్యత కార్మిక వర్గ ఐక్యత ద్వారా మాత్రమే కదిలిపోతుంది" గా మావోయిస్టులు తమ ఆచరణకు భాష్యం చెప్పుకున్నారు. మావో చెప్పినట్లు "విప్లవ విజయం సాధించాలంటే ఒక రాజకీయపార్టీ తన రాజకీయపంథా సమంజసత్వం పైన, తన నిర్మాణబలం పైన ఆధారపడాలి" అన్న గైడెన్స్ నేడు మావోయిస్టులు అర్థం చేసుకున్నట్లుగా వారి ఐక్యత అందుకు అద్దం పడుతున్నది.

నిజానికి మిగతా రాష్ట్రాల అధికార యంత్రాంగానికి ఆంధ్రకు ఒక విషయంలో మనం స్పష్టత చూడవచ్చు. నిర్బంధ రూపాలు ఏ రాష్ట్రంలో లేని విధంగా అక్కడ అమలు చేయడంలో పోలీసు అధికారుల కూటమిని ఒక శక్తిగా పాలకపార్టీలు పోషించాయి. అందుకే 1984 నుండి 2004-05 వరకు పోలీసు అధికారులు సియం, హెచ్‌యంలే మాట్లాడారు ఏ విషయం అయినా. స్వంత కేబినెట్, ప్రతిపక్షం అనేది నామ మాత్రంగా వుండటం కాదు నిర్వీర్యంగా వ్యవహరించాయి. ఇపుడు వై.ఎస్.ఆర్, చంద్రబాబు నాయుడుగారు మావోయిస్టుల యెడల రెండు భిన్న వైఖరులు గల వారని ఎవరైనా అనుకుంటే అది పొరపాటని చెప్పక తప్పదు. అధికారం కేంద్రీకరింపబడిన చోట అన్నీ దానికి లోబడే జరుగుతాయి తప్ప అతీతంగా కాదు. అక్రమ సంపాదన, మరొకటి పాలకవర్గాల అనైతికలో భాగంగా పెరిగినవే తప్ప దానిని వ్యవస్థలో విడదీసి చూడకూడదు. యుద్ధం బద్ధలైనాక అన్ని పోరాట నిర్మాణ రూపాలు యుద్ధానికి సేవ చేసేలానే వుండాలనేది యుద్ధ నియమం. ఈ రోజు ఒకో ఘట్టం పూర్తి చేసుకొని మూడవ ఘట్టంలో వున్న వై ఎస్ ఆర్ ప్రజల, ప్రజాస్వామిక వాదుల అభ్యర్థనలను వింటాడని తాను నిన్న ప్రకటించినట్లు జరిగిన పొరపాట్లకు నైతిక బాధ్యత వహించి దాడి ఆపి, ప్రజలకు క్షమాపణ చెప్పి రెండవ విడతను కొనసాగిస్తాడని ఆశించడం అత్యాశనే అవుతుంది. అందువల్ల అధికారం ఆక్రమణ యుద్ధం ప్రకటించిన చోట ఆచితూచి అడుగువేస్తూ ప్రతిఘటించకుండా మనలేం అనేది ఆంధ్ర ప్రజలు మరోసారి గ్రహించాలని చరిత్ర వారి పరిపక్వతకు దర్పణంగా నిలవాలని నిజమైన ప్రజాస్వామ్యం, ప్రత్యామ్నాయ పాలన అంకురంగానైనా మన ముందుకు వస్తుందని ఆశిద్దాం. ❑

(19వ పేజీ తరువాయి)

సమకాలీన ప్రయోజనాలను ఉపేక్షిస్తూ, కేవలం ఆడిట్ నివేదికలపై చర్చలకే పరిమితం అయిన పరిస్థితిని కమిటీ ఎదుర్కొంది. కాలదోషం పట్టిన కారణంగా సైతం సంబంధిత శాఖలు సవివర వివరణలను ఇచ్చుకోలేని పరిస్థితులూ నెలకొన్నాయి. ఆయా అవకతవకలకు బాధ్యులైన అధికారులపై చర్యలు తీసుకునేందుకు, ఆ చర్యలకు పాల్పడ్డ అధికారులు పదవీ విరమణను చేయడం గానీ, లేదా పదోన్నతులను పొంది పై స్థానాల్లో వుండడం గానీ జరుగుతూ వుంది. ఈ కారణాల రీత్యా, ఆడిట్ నివేదికలను శాసనసభకు సమర్పించిన మూడు నెలల లోగా వివరణలను పొందాల్సి వుంటుందని ప్రజా పద్దుల కమిటీ భావించింది. ఇందుకనువుగా ఆర్థిక శాఖ, కాలానుక్రమ వివరణలను పాలనా శాఖలు ప్రజాపద్దుల కమిటీకి సమర్పించేలా వ్యవహరించాల్సి వుందని కమిటీ సూచించింది.

కుంగిపోతున్న ద్రవ్య పరిస్థితిని గుర్తించి, సవరణా చర్యలు తీసుకునే క్రమంలో ప్రస్తుత ప్రభుత్వం వుంది. పాలనా నిర్వహణలో నెలకొన్న అవకతవకలను సవరించుకోగలిగితే, రాజ్యాంగ పర అవరోధాలను అధిగమించగలిగితే రాష్ట్ర ద్రవ్య పరిస్థితి మెరుగయ్యే అవకాశాలు వున్నాయి.

(స్వేచ్ఛానువాదం: విద్యాభూషణ్)

# నక్సలైట్ ఉద్యమం - మరి కొన్ని ఆలోచనలు

- జన్ను చిన్నాలు

వీక్షణం మార్చ్ 1-31 సంచికలో "నక్సలైట్ ఉద్యమం-కొన్ని ఆలోచనలు" పేరుతో నెల్లూరి కృష్ణమూర్తి వ్యాసం వెలువడింది. ఒక సీరియస్ అంశంపై సీరియస్‌గా కొన్ని కొత్త ఆలోచనలు, ప్రతిపాదనలు, ప్రశ్నలు సంధించినందుకు కృష్ణమూర్తికి కృతజ్ఞతలు. చర్చ జరగవలసిన అవసరాన్ని కూడ గుర్తించి, చర్చను ఆహ్వానించినందుకు అభినందనలు. ఆయన వ్యాసంలో కొన్ని అమాయకపు ప్రతిపాదనలు ఉన్నప్పటికీ, అవి మౌలికంగా వ్యాసం స్పిరిట్‌కు భిన్నమైనవి కావు గనుక వాటిని వదిలి సీరియస్ అంశాల మీదనే చర్చించదలిచాను.

కృష్ణమూర్తి వ్యాసంలో ఎనిమిది దశాబ్దాలకు పైబడిన కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర గురించి, మూడు దశాబ్దాలకు పైబడిన నక్సలైటు ఉద్యమ చరిత్ర గురించి అనేక అంశాలు ప్రస్తావించారు. ఆ అన్ని అంశాల మీద విడివిడిగా స్పందించడం సాధ్యం కాదు. ఆయన వ్యాసంలో ప్రధానమైనవని నేననుకుంటున్న ఏడెనిమిది అంశాల గురించి మాత్రం చర్చిస్తాను.

మొట్టమొదటిగా, "అటు నక్సలైట్లు, ఇటు ప్రభుత్వం ముందుగా తేల్చుకొని వుండవలసిన అంశం భూయాజమాన్యంలో ఏ మార్పు ఇద్దరికీ ఆమోదయోగ్యం? అది అమలు జరిపే యంత్రాంగపు స్వరూపం. ఇది తేలకపోవడమే చర్చల విషయంలో గందరగోళానికి కారణం" అని కృష్ణమూర్తి అన్నారు. చర్చల విషయంలో గందరగోళానికి కారణం కృష్ణమూర్తి ఊహిస్తున్నది కాదు. అసలు భూయాజమాన్యంలో ఇద్దరికీ ఆమోదయోగ్యమైన మార్పుగాని, ఇద్దరూ ఏకీభవించే యంత్రాంగం గాని ఉండడానికి వీలే లేదు. కనుక అది ముందు తేల్చుకోవడం అనే ప్రశ్నే తలెత్తదు.

చర్చల క్రమంలో నక్సలైట్లు చాల స్పష్టంగా భూమి సమస్య పరిష్కారంలో, భూసంబంధాల మార్పులో ప్రభుత్వ వైఖరికీ తమ వైఖరికీ చాల తేడా ఉందని చెప్తున్నారు. కాని, ఐదు దశాబ్దాలుగా అన్ని పాలక పార్టీలూ వాగ్దానం చేస్తూ వచ్చిన భూపంపకం అయినా అమలు జరుపుతారా లేదా అని ప్రశ్నించారు. ఒక రకంగా ఇది పాలకవర్గాల వాగ్దానాల బూటకత్వాన్ని బహిర్గతం చేయడానికి తప్ప మరొకందుకు పనికి రాదు. భూమి సమస్యను ఎజెండాలో రెండో అంశంగా చేర్చింది నక్సలైట్లే. చర్చలలో ఒక వివరమైన పత్రం రాసుకొచ్చి సమావేశంలో ప్రతిపాదించినదీ నక్సలైట్లే. ఆ పత్రం ఒకసారి చదివితే భూ సమస్య గురించి, భూ పంపిణీ గురించి, వ్యవసాయరంగ అభివృద్ధి గురించి నక్సలైట్ల అవగాహన ఏమిటో అర్థమవుతుంది. చర్చల క్రమంలో ప్రభుత్వ ప్రతినిధులు ఆ అవగాహనను ప్రశ్నించడం గాని, నక్సలైట్లు చూపిన గణాంకాలను సాధికారికంగా ఖండించడం గాని చేయలేకపోయారు. ఎక్కువలో ఎక్కువగా నక్సలైట్లు లేవనెత్తిన అంశాలను విచారించడానికి ఒక భూకమిషన్ వేస్తామని హామీని మాత్రమే ప్రభుత్వం ఇచ్చింది. పంపిణీకి సాధ్యమైన భూమి ఒక కోటీ ఇరవైలక్షల ఎకరాలకు పైగా ఉండవచ్చునని నక్సలైట్లు అంటే, ప్రభుత్వం ఆ అంకెను ఖండించింది గాని తనవైపు నుంచి అంచనా ఏమిటో చెప్పలేదు. మొత్తం మీద భూసమస్య విషయంలో ప్రభుత్వ అవగాహన కన్న నక్సలైట్ల అవగాహనే మెరుగ్గా ఉన్నదని చర్చలు నిరూపించాయి. ఇంత బ్రహ్మాండమైన యంత్రాంగం, అన్ని వనరులూ ఉన్న ప్రభుత్వం చెయ్యలేని పనిని ఏ వనరులూ లేని, నిత్యం నిర్బంధంలో జీవిస్తున్న నక్సలైటు నాయకులు చెయ్యగలిగారని కూడ చర్చలు నిరూపించాయి.

కనుక కృష్ణమూర్తి గారన్నట్టు చర్చల గందరగోళానికి కారణం భూమి విషయంలో అవగాహనలు తేలకపోవడం కాదు. కచ్చితంగా ఆ అవగాహన లేమిటో, ఎవరు భూయాజమాన్యాన్ని యథాతథంగా ఉంచదలచుకున్నారో, ఎవరు భూయాజమాన్యంలో ఎటువంటి మార్పులు కోరుతున్నారో తేలిపోయింది. అందువల్లనే చర్చలు ముందుకు సాగించలేని స్థితి ప్రభుత్వానికి ఏర్పడింది.

రెండవది, అసమానత ఉన్నంతవరకు శాంతి ఎలా సాధ్యం అని కృష్ణమూర్తి గారు చాల ముఖ్యమైన ప్రశ్నలేవనెత్తారు. "ప్రకృతి వనరుల అనుభవంలో అసమానత వున్నంతవరకూ పేదలకు శాంతి ఎలా సాధ్యం" అని ఆయన చాల సరైన ప్రశ్న అడిగారు. నిజమే, వర్గ సమాజం కొనసాగినంతకాలం, వర్గ అసమానతలు కొనసాగినంత కాలం ఆ అసమానతలు అశాంతికీ, హింసకూ కారణమవుతూనే ఉంటాయి. వర్గ పాలన యథాతథంగా ఉండనిస్తూ, శాంతి ప్రయత్నాలు చేసే వారెవరయినా ఆత్మవంచనో, పరవంచనో చేస్తున్నట్టే లెక్క. కాని ఇక్కడ కృష్ణమూర్తి గారు విస్మరిస్తున్న అంశం ఒకటి ఉంది.

తాత్వికంగా చాల సరైన ప్రశ్న వేస్తున్న కృష్ణమూర్తి గారు, రాజకీయ, సామాజిక సందర్భాన్ని గమనంలోకి తీసుకోవడం లేదు. వర్గ అసమానత వల్ల సాధారణంగా ఉండే అశాంతికీ, ప్రభుత్వ యంత్రాంగం సాగిస్తున్న మితిమీరిన, అనవసర హింసాకాండవల్ల, ఆ హింసా కాండను ప్రతిఘటిస్తూ ప్రజలు సాగించే ప్రతిహింసాచర్యల వల్ల సమాజంలో తలెత్తే అశాంతికీ తేడా ఉంది. మొదటిరకం అశాంతి ఎప్పుడూ ఉండేదే. అది విప్లవాల వల్ల, సామాజిక మార్పుల వల్ల మారవలసిందే. కాని రెండో రకం అశాంతిని తగ్గించడానికి అవకాశం ఉంది. ప్రభుత్వాలు చట్టబద్ధ,

రాజ్యాంగ బద్ధ పాలన సాగిస్తే, ప్రజల పౌర, ప్రజాస్వామిక హక్కుల అనుభవానికి హామీ ఇస్తే, వాక్సభాస్వాతంత్ర్యాలను, భావ ప్రకటనా స్వేచ్ఛను అడ్డుకోకపోతే, ప్రజల అసంతృప్తి ప్రకటనలకు, వ్యక్తీకరణలకు అవకాశమిస్తే, ప్రతి ప్రజా ఆందోళనను సాయుధ బలగాల ద్వారా అణచివేయడానికి ప్రయత్నించక పోతే సమాజంలో హింస, అశాంతి చాల వరకు తగ్గిపోతాయి. చర్చల క్రమంలో మధ్యవర్తులు గాని, నక్సలైటు పార్టీలు గాని కోరుకున్నది ఇటువంటి ఉపశమనాన్నే. అందుకు ప్రభుత్వం కూడ తన అధికారాలను వదులుకుని దిగిరావలసిన అవసరం లేదు. తన పరిమితుల లోపల పనిచేస్తే చాలు. రాజ్యాంగం లోని అధికరణం 19, అధికరణం 21 లను కచ్చితంగా పాటిస్తానని చెపితే చాలు. అప్పుడు కూడ అసమానతలు ఉంటాయి. ఆ అసమానతలను గురించి ప్రశ్నించే అధికారం ప్రజలకు ఉంటుంది. కాని ఆ ప్రశ్నలే అశాంతి కావు. ఆ ప్రశ్నలను బలప్రయోగంతో అణగదొక్కదలచినప్పుడు అశాంతి ప్రబలుతుంది.

పైన చెప్పిన రెండు అంశాల నుంచి కృష్ణమూర్తి గారు నిర్ధారించిన అంశమేమంటే భూమి, శాంతి కన్న 'ఆయుధం' ముఖ్య మైనదని ఇరు పక్షాలు ముందుకు తెచ్చాయని.

అది మూడో అంశం. "ప్రజల చేతిలో ఆయుధాలు కాకుండా ప్రజలే ఆయుధం కాకుండా సాగే ఉద్యమాలు ఈ దుస్థితిని ఎదుర్కొనక తప్పదు" అని ఆయన నిర్ధారించారు.

వ్యవస్థ మార్పుకు సాయుధ పోరాటం అవసరం లేదని, శాంతి యుత పార్లమెంటరీ పద్ధతుల ద్వారా అది సాధ్యమవుతుందని నమ్మేటంత అమాయకత్వంలో కృష్ణమూర్తి గారు ఉన్నారనుకోవడం లేదు. అతి చిన్న అధికారాలను కూడ స్వచ్ఛందంగా, హృదయ పరివర్తనతో, ప్రజాస్వామికంగా, ఇచ్చిపుచ్చుకోవడంతో వదులు కోవడానికి ఎవరూ సిద్ధంగా లేరని సమాజంలో ఏ అంశాన్ని చూసినా తేలిపోతుంది. ఇక వ్యవస్థను మార్చడానికి సాధనమైన పీడిత వర్గ రాజ్యాధికారం సాయుధంగా, బలప్రయోగం ద్వారా కాక మరొక రకంగా సాధ్యమని అనుకోవడం అమాయకత్వమే. మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథం చెప్పేదీ అదే. ప్రపంచ చరిత్ర చెప్పేదీ అదే. భారత చరిత్ర చెప్పేదీ అదే.

అయితే ఈ సాయుధపోరాటం ఎవరు చేయాలి? ఎవరో నలుగురు ఆయుధాలు చేతపట్టి పోరాడితే సరిపోతుందా? అలా సరిపోతుందని ఎవరూ అనలేరు. కాని సాయుధపోరాటం ద్వారా మినహా మరొక రకంగా సామాజిక సమస్యల పరిష్కారం కాదనే అవగాహన మొదట కొద్దిమందికే కలిగినా, ఆ కొద్దిమందే ఆ సాయుధ పోరాట రాజకీయాలు ప్రచారం చేస్తారు. ఈ ప్రచార క్రమంలో అంతకంతకూ ఎక్కువ మంది ఆ మార్గంలో విశ్వాసం పెంచుకుంటారు. పీడిత ప్రజలలో కూడ నూటికి నూరు మందీ ఏరోజునైనా ఈ ఒక్క మార్గాన్నే నమ్మాలని లేదు. నమ్మిన దాఖలాలు చరిత్రలో లేవు. స్పార్టకస్ నుంచి నక్సలైట్ల దాకా తిరుగు బాటు భావాలను ప్రచారం చేసిన వాళ్ళు పీడితులలో కొద్దిభాగం మాత్రమే. గెలిచిన విప్లవాల చరిత్రలు చూసినా రష్యా, చైనా, తూర్పుయూరప్, క్యూబా, వియత్నాం, కంపూచియా వగైరాలలో సాయుధ పోరాటాలలో వాస్తవంగా పాల్గొన్నది అక్కడి పీడిత ప్రజలలో ఒక సెక్షన్ మాత్రమే. కాకపోతే ఆ సెక్షన్ అత్యధిక పీడిత ప్రజల ఆకాంక్షలకు వ్యాఖ్యాతగా, నాయకురాలిగా, నిర్ణేతగా ప్రవర్తించగలిగిన శక్తియుక్తులు కలిగి ఉండింది.

అందువల్ల, మన దగ్గర జరిగే సాయుధ పోరాటం గురించి మాట్లాడేటప్పుడు కూడ అది 'ప్రజల చేతిలో ఆయుధం కాకుండా, ప్రజలే ఆయుధం కాకుండా' సాగుతున్నదనే తొందరపాటు సూత్రీకరణ మంచిది కాదు. 1969 తర్వాత దేశంలో సాయుధ పోరాట ఉద్యమం ఎన్ని చీలికల పాలయినా, వేలాదిమంది కార్యకర్తలను పోగొట్టుకున్నా ఇప్పటికీ కొనసాగుతున్నదంటే దానికి ఎంతో కొంత ప్రజల మద్దతు, ప్రజల భాగస్వామ్యం ఉన్నదనే అనుకోవాలి. దేశంలో ఒక మారుమూల కుగ్రామంలో ప్రారంభమైన ఉద్యమం ఇవాళ ప్రభుత్వ లెక్కల ప్రకారమే 13 రాష్ట్రాలకు, దేశంలోని 500 జిల్లాలలో 200 జిల్లాలకు వ్యాపించింది. మన స్వీయ మానసిక దురభిప్రాయాలు ఏమీ అడ్డుపడకపోతే, భౌతిక పరిస్థితిని యథాతథంగా చూడగలిగితే సమాజంలో పెరుగుతున్న విప్లవ అవసరం, ఆ అవసరాన్ని గుర్తిస్తున్న ప్రజల విస్తరణ కనబడతాయి. అట్లని విప్లవోద్యమం కింద సాగుతున్న సాయుధ పోరాటం ఏ పొరపాట్లు లేకుండా, సర్వ సమగ్రంగా సాగుతున్నదని కాదు. చరిత్రను నిర్మించేది ప్రజలు మాత్రమేనని కృష్ణమూర్తి గారు రాసిన దాన్ని పూర్తిగా ఒప్పుకుంటూనే, ఆ నిర్మాణమవుతున్న చరిత్రను చూడమని మాత్రమే నేను కోరుతున్నాను.

ఇక నాలుగో అంశం, ఆయుధాల అవసరం, విప్లవ ఆయుధాలు, స్టాలిన్ పేర్కొన్న సాయుధ పోరాటం వంటి అంశాలను కూడ చర్చించిన కృష్ణమూర్తి గారు ఆ చారిత్రక పరిజ్ఞానానికి భిన్నంగా "ఒకసారి ఆయుధ విసర్జనకు అంగీకరించడం అంటే నిరాయుధీకరణను జిరాయితీ హక్కుగా రాసివ్వడం కాదు" అన్నారు.

ఈ అంశం చర్చించబోయే ముందు ఇటీవలి చర్చలలో వెలువడిన రెండు విషయాలు ప్రస్తావించాలి: ఒకటి, ప్రభుత్వానికీ నక్సలైట్లకూ మధ్య జరిగిన చర్చల సందర్భంలో దిన పత్రికలలో ఉత్తరాల శీర్షికలో ఎంతోమంది ప్రజలు తమ అభిప్రాయాలు ప్రకటించారు. చర్చల ఫలితంగా నక్సలైట్లు ఎక్కడ ఆయుధాలు వదులుతారోననే అనుమానంతో, 'మీ చేతుల్లో ఆ ఆయుధాలు ఉన్నందువల్లనే మేం తలెత్తుకుని బతకగలుగుతున్నాం. ఆ ఆయుధాలను వదిలిపెట్టకండి' అని దళితులు, ఆదివాసులు రాశారు. ఈ వ్యక్తీకరణ ప్రజాభిప్రాయానికి ఒక బలమైన సూచన. మరెన్నో రూపాలలో కూడ వచ్చింది. రెండు. అనలిటికల్ మంత్లీ రివ్యూ పత్రిక చర్చలపై సంపాదకీయం రాస్తూ 1951 ఆయుధ

విసర్జన వల్ల భారత విప్లవోద్యమానికి జరిగిన ప్రమాదాన్ని ప్రస్తుతం నక్సలైట్లు గమనంలో ఉంచుకోవాలని హెచ్చరించింది.

'అవసరాన్ని, సందర్భాన్ని బట్టి దింపి, తిరిగి చేపట్టడం ప్రజల హక్కు' అని కృష్ణమూర్తి గారు అన్న మాటతో నూటికి నూరుపాళ్ళు ఏకీభవిస్తున్నాను. కాని అదే సమయంలో, పాలకవర్గాలు నక్సలైట్లను ఏదో ఒకరకంగా నిరాయుధీకరించాలని పథకం వేసుకుని కూచున్నప్పుడు నిరాయుధం కావడం మంచిదా ఆలోచించమని కోరుతున్నాను. ప్రజలు సాయుధం కావాలా, నిరాయుధం కావాలా అన్నది ప్రజల హక్కే గాని ప్రభుత్వాలకూ, పాలక వర్గాలకూ సంబంధించిన విషయం కాదు. అందువల్లనే నిరాయుధం కావాలని ప్రభుత్వం అడిగిన డిమాండ్‌ను నక్సలైట్లు అంగీకరించక పోవడం సరైనదేననుకుంటాను. పైగా ప్రభుత్వం తాను విధ్యుక్తధర్మంగా చేయవలసిన పనులు చేయడానికి ప్రతిఫలంగా నక్సలైట్లు ఆయుధ విసర్జన చేయాలనడం ప్రతిఫలం ఆశించగూడని చోట ఆశించడమే.

ఆయుధ విసర్జన అడిగే హక్కు ప్రభుత్వానికి ఉందా లేదా అనే విషయం అలా ఉంచినా, భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రను చూస్తే 1951లో చేసిన పోరాట విరమణ, ఆయుధ విసర్జన "జిరాయితీ హక్కు" గా రాసిచ్చినట్టే అయింది. 1951 నుంచి గడిచిన ఈ 54 సంవత్సరాలలో రాజ్యాధికారం గాని, విప్లవంగాని, వాటికోసం సాయుధ పోరాటం అవసరం గాని అటు భారత కమ్యూనిస్టు పార్టీ, ఇటు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) సిద్ధాంతంలో గాని, ఆచరణలో గాని ఎందుకు లేకుండా పోయాయి? 1951 నిరాయుధీకరణ ఐదు దశాబ్దాలకు పైగా ఆ రెండు "కమ్యూనిస్టు" పార్టీలనూ ఎందుకు పట్టి పీడిస్తోంది? శాంతియుత పరివర్తన సాధ్యమేనని పార్లమెంటరీ కుషన్ సీట్లలో కూరుకుపోయి, ఆ విలాసాలకు, పైరవీలకు అలవాటు పడిన ఆ రెండు పార్టీలు తమను తాము వంచించుకోవచ్చు, ప్రజలను వంచించవచ్చు. కాని ''యువకుడిగా సమాజాన్ని కలగన్న స్వాప్నికుడు'', ఆ "స్వప్నం ఫలించలేదని విలవిలలాడే వృద్ధ హృదయం" కృష్ణమూర్తిగారికి ఆ విషయంలో నమ్మకం ఉందా?

ఐదో అంశం. ఎన్నికల పట్ల నక్సలైట్ల వైఖరి. నక్సల్బరీ ప్రజ్వలనం తర్వాత భారత కమ్యూనిస్టు ఉద్యమంలో ఎన్నికలలో పాల్గొనే వారు, బహిష్కరించే వారు అనే స్థూలమైన విభజన వచ్చింది. ఎన్నికలలో పాల్గొనే నక్సలైటు పార్టీలు కూడ ఉన్నప్పటికీ, ప్రధానంగా ఎన్నికల ద్వారా వ్యవస్థ మార్పు జరగదనేదే నక్సలైటు అవగాహన. ఎన్నికలలో ఎక్కడో ఒకచోట నక్సలైట్లు పాలకపార్టీల గెలుపుకు సహకరిస్తున్నారనే ఆరోపణలు కూడ తరచుగానే వస్తున్నాయి. కాని కృష్ణమూర్తి లాగ నిజాయితీగా విషయాలను పరిశీలించదలచుకున్న మేధావి కూడ నక్సలైట్లు లోపాయికారీగా ఏదో ఒక పాలకవర్గ పార్టీకి సహకరిస్తున్నారని పత్రికలు, ప్రత్యర్థి పాలకవర్గ పార్టీలు చేసే ఆరోపణను, అబద్ధ ప్రచారాన్ని యథాతథంగా ఆమోదించడం ఆశ్చర్యకరం. ఎన్నికలను బహిష్కరించే నక్సలైటు పార్టీలు, ముఖ్యంగా ఇప్పుడు చర్చలలో పాల్గొంటున్న మావోయిస్టుపార్టీ (పాత పీపుల్స్‌వార్) అటువంటి లోపాయికారీ ఒప్పందాలకు ఎప్పుడూ దిగలేదు. ఆ పార్టీ ఎప్పుడూ బహిష్కరణ పిలుపే ఇస్తోంది. కాని వాళ్ళ ప్రభావం ఎక్కువగా ఉన్న ప్రాంతాలలో, స్వచ్ఛంద బహిష్కరణను దెబ్బతీయడానికి పోలీసులే జనాన్ని పోలింగ్ బూత్‌లకు తోలుకుపోవడం, పాలకవర్గ పార్టీలు, పోలీసులు కలిసి రిగ్గింగ్ చేయడం జరుగుతోంది. ఈ విషయాలన్నీ ఆయా సందర్భాలలో పత్రికలలో కూడ వచ్చాయి. అట్లా బలవంతంగా బూత్‌లకు వెళ్ళిన ప్రజలు, బహిష్కరణ హక్కును వినియోగించుకోలేకపోయిన ప్రజలు, లోపలికి వెళ్ళిన తర్వాత తమ కసిని వ్యక్తీకరించిన సందర్భాలు, తాము తక్కువ ప్రమాదకరమని భావించిన అభ్యర్థికి వోటు వేసిన సందర్భాలు ఉన్నాయి. దాని అర్థం నక్సలైట్లు ఎవరితోనో లోపాయికారీ ఒప్పందం కుదుర్చుకున్నారని కాదు. 'అందరూ దొంగలే' అనే అభిప్రాయాన్ని ప్రజలు మార్చుకున్నారని కాదు. ఓడిపోయిన ప్రతివాడూ ప్రతిసారీ 'గెలిచినవాడు నక్సలైట్లతో ఒప్పందం కుదుర్చుకున్నాడ' నే ఆరోపణ చేయడంలో వాస్తవం సంగతి ఎలాగున్నా, ప్రజలలో నక్సలైట్లకు అంత ప్రభావం ఉందని అంగీకరిస్తున్నారన్న మాట.

ఆరో అంశంగా, మూడు కార్యక్రమాలు, మూడు ఎత్తుగడలు విఫలమయ్యాయని కృష్ణమూర్తి గారు రాశారు. నాలుగు దశాబ్దాల విభిన్న కార్యక్రమాలు బూర్జువా వర్గపాలనను సమర్థించే స్థితికి, అందులో కొన్ని బూర్జువా పార్టీలు చొరబడకుండా కాపలా కాచే స్థితికి చేరుకున్నాయని ఆయన అన్నారు. మొదటి రెండు కార్యక్రమాలలో, ఎత్తుగడలలో విప్లవం గాని, పీడిత వర్గ రాజ్యాధికారం గాని ఉన్నాయో లేవో ఆయనే జాగ్రత్తగా పరిశీలించి చూపాలి. బూర్జువా వర్గ పాలనను సమర్థించడం, అందులో చేరడం, అందులోకి మరికొన్ని బూర్జువా వర్గ ముఠాలు చేరకుండా కాపలా కాయడం వంటి ద్వారా తమ పేర్లలో 'కమ్యూనిస్టు' 'మార్క్సిస్టు' పదాలు ఉన్నప్పటికీ తాము యథాస్థితి వాద సమర్థకులమేనని ఆ రెండు పార్టీలు అణువణువునా, అక్షరాలా రుజువు చేసుకుంటూనే ఉన్నాయి. కనుక వాళ్ళ విషయంలో విఫలమయ్యారని చెప్పడానికి వీలులేదు. ఒక రకంగా సఫలమయ్యారు కూడ. తాము కమ్యూనిస్టులమని ప్రజలకు భ్రమలు కల్పించడంలో, సోషల్ డెమొక్రటిక్ పార్టీలుగా ప్రజా ఆగ్రహాన్ని పక్కదారి పట్టించడంలో, పాలకవర్గాలకు పంచమాంగ దళంగా రక్షణ కల్పించడంలో వాళ్ళు చాల వరకు సఫలమయ్యారు. ఈ పనులు బైటి నుంచి చేసే దశ దాటగానే, నేరుగా ప్రభుత్వంలో చేరి ఆ పని చేస్తున్నారు. పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపుర లాంటి ఉదాహరణలు, కేంద్రంలో పొత్తులు, బైటి నుంచి మద్దతులు ఈ విషయానికి సంపూర్ణ నిదర్శనాలు.

ఇక మూడో కార్యక్రమం, మూడో ఎత్తుగడ విఫలమయ్యాయని అనేంత పెద్ద నిర్ధారణకు వెళ్ళేముందు ఆ కార్యక్రమం, ఆ ఎత్తుగడలు సాగుతున్న భౌతిక పరిస్థితిని, స్వీయ మానసిక శక్తులను ఒకసారి పరిగణనలోకి తీసుకోవాలి. వేలాదిమంది కార్యకర్తలను చంపివేసిన ప్రభుత్వ దుర్మార్గం (ఇందులో బెంగాల్‌లో సిపిఎం పాత్ర కూడ ఉంది) ప్రజలలో పోరాట పటిమను చంపి పైరవీ రాజకీయాలను పెంచి పోషించిన సోషల్ డెమొక్రటిక్ కుటిలత్వం, ఆకర్షణీయమైన నినాదాల ద్వారా ప్రజలను భ్రమల్లో ముంచడంలో పాలకవర్గాలు సాధించిన విజయం, స్థానిక ప్రభుత్వాలకు సామ్రాజ్యవాదుల వత్తాసు, జాతీయోద్యమ వాతావరణానికి భిన్నంగా మధ్యతరగతిలో పెరిగిన అలసత్వం వంటి భౌతిక కారణాలెన్నో మూడో కార్యక్రమం విస్తరించకుండా అడ్డుకుంటున్నాయి.

ఇక ఈ నాలుగు దశాబ్దాలలో కనీసం పదివేలమంది సుశిక్షితులైన కార్యకర్తలను, నాయకులను ఈ మూడో కార్యక్రమం పోగొట్టుకుంది. బహుశా ప్రపంచ చరిత్రలోనే ఇంత పెద్ద ఎత్తున స్వీయమానసిక శక్తులను కోల్పోవడం అరుదుగా జరిగి ఉంటుంది. ఒక మరణించిన కార్యకర్త స్థానంలో మరొకరు భర్తీ కావడానికి ఎంతకాలం, ఎంత శక్తి అవసరమవుతాయో కృష్ణమూర్తిగారికి చెప్పనవసరం లేదు. ఈ పదివేలమంది మరణించిన కార్యకర్తలకు కనీసం ఐదారు రెట్లయినా ఉద్యమం నుంచి వైదొలగిన, ఇతర రాజకీయ మార్గాలు పట్టిన కార్యకర్తలుండి ఉంటారు. స్వీయ మానసిక శక్తులలో ఈ భారీ నష్టం లేకుండా ఉన్నప్పుడే ఈ కార్యక్రమం, ఎత్తుగడలు విఫలమయ్యాయో, సఫలమయ్యాయో చెప్పడం సాధ్యమవుతుంది.

ఈ అంశాలన్నీ అలా ఉంచి, కృష్ణమూర్తి గారు లేవనెత్తిన మరొక ముఖ్యమైన అంశం, తీవ్రంగా చర్చించవలసిన అంశం గ్రామ జీవితం డబ్బుమయమయిందని, అంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి పద్ధతిలో అంతర్భాగమైందనేది. ఇది భారత సమాజంలో ప్రధానవైరుధ్యం ఏమిటనే అవగాహనకు సంబంధించినది. ఆ అవగాహనను బట్టే భారత విప్లవ మార్గం ఎలా ఉండాలనేది నిర్ణయమవుతుంది. ఇంత ముఖ్యమైన చర్చను ముందుకు తెచ్చినందుకు కృష్ణమూర్తి గారికి కృతజ్ఞతలు. ఆయనే రాసినట్టు భారతదేశంలో కూడ రష్యాలో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి గురించి లెనిన్ చేసిన లాంటి పరిశోధన, అధ్యయనం, విశ్లేషణ జరగవలసి ఉన్నాయి. ప్రజా పక్ష సామాజిక, ఆర్థిక పత్రికగా 'వీక్షణం' అటువంటి బృహత్ ప్రయత్నానికి పూనుకోవాలని నా కోరిక.

భారత సమాజం అని మొత్తంగా ఏ విశ్లేషణ చేసినా ఎక్కడో ఒకచోట మినహాయింపు ఉండేటంత బహుళ ఉత్పత్తి విధానాల, బహుళజాతుల, బహుళ కులాల, బహుళ భాషల, ప్రాంతీయ అసమానతల, మత వైవిధ్యాల సమాజం మనది. అందువల్ల ఏ గోదావరి, కృష్ణా జిల్లాలనో, పంజాబ్‌నో, హర్యానానో, తంజావూరునో పరిశీలించి వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందన్నా, ఏ బొంబాయి, బెంగుళూరు, హైదరాబాదులను చూసి సామ్రాజ్య వాదమే ప్రధానాంశమన్నా, ఏ తెలంగాణానో, బీహార్‌నో చూసి ఇంకా ఇది భూస్వామ్య విధానమేనన్నా, ఏ నాగాలాండ్‌నో, కాశ్మీర్‌నో చూసి జాతుల సమస్యే ప్రధానమన్నా, అట్లాగే సెక్షనల్ ఉద్యమాలను చూసి కులమో, ప్రాంతీయతో, లింగమో ప్రధానమన్నా ఆ విశ్లేషణ పూర్తి వాస్తవం కాజాలదు. దేశంలో కొనసాగుతున్న వైవిధ్యాలన్నిటినీ గమనంలోకి తీసుకుంటూ, విప్లవ లక్ష్యంతో, ప్రధాన వైరుధ్యమేమిటో నిర్ధారించగల, అంటే ఏ వర్గాల మధ్య ఐక్యతతో ఏ వర్గాల మీద పోరాడాలో వ్యూహం-ఎత్తుగడలు నిర్ధారించగల విప్లవోద్యమ నాయకత్వం కావాలి. ఆ దిశలో జరగవలసిన చర్చకు కృష్ణమూర్తి వంటి ఆలోచనాపరుల అవసరం చాల ఉంది.

అటువంటి చర్చకు దోహదపడేటందుకు నేను కొన్ని అంశాలు ప్రతిపాదించదలిచాను. భారతదేశం అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజమని నక్సలైట్ ఉద్యమం నిర్వచించింది. వారు ఆ వర్ణన చేసిన 1967 కన్న మిన్నగా ఇవాళ ఇది అర్ధవలసగా ఉన్నదని ఎక్కువమందే గుర్తిస్తున్నారు. 1992 తర్వాత దేశంలో, ఆర్థిక వ్యవస్థలో జరిగిన మార్పులు నామమాత్రపు సార్వభౌమత్వాన్ని కూడ బద్దలు గొట్టి, దేశాన్ని పేరుకే స్వతంత్రదేశంగా, వాస్తవంగా సామ్రాజ్యవాద బంటుగా మార్చివేసింది. ఆర్థిక, సైనిక, రాజకీయ, సాంస్కృతిక ఆధిపత్యాలలో ఇవాళ భారత ప్రభుత్వం సైనిక రంగంలో తప్ప మరేరంగంలోను స్వతంత్ర విధానాలు లేని స్థితికి చేరింది.

ఇక అర్ధ భూస్వామ్య స్థితి నుంచి పెట్టుబడిదారీ స్థితికి చేరాలంటే కేవలం వ్యవసాయంలో యంత్ర వినియోగం, గ్రామ సీమలలో డబ్బు వినియోగం, భూమిలో, శ్రమలో మార్కెట్‌లు ఏర్పడి, అవి పూర్తిగా సరుకులుగా మారిపోవడం వంటి లక్షణాలు చిహ్నాలే గాని అవే పూర్తి స్వభావాన్ని విశదం చెయ్యవు. భూసంబంధాలలో, యాజమాన్యంలో మార్పు అనే మౌలిక లక్షణం మారవలసి ఉంటుంది. అంటే నిజమైన అర్థంలో భూసంస్కరణలు జరగవలసి ఉంటుంది. ఆ పని జరగనంత కాలం, మార్కెట్‌కోసం ఉత్పత్తి ఎంత పెరిగినా వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం వచ్చిందని అనలేము. దీనికే మరో కోణంగా వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం వస్తే అంతకంతకూ ఎక్కువగా శ్రమ శక్తిని బైటికి తోసి వేస్తుంది. ఆ శ్రమ శక్తికి బైట మార్కెట్ తయారవుతుంది. ఈ పని కూడ జరగడం లేదు.

ఐతే ఈ విషయంలో ఎవరమూ ఆలోచనలకు తలుపులు మూసుకొని కూచొననక్కరలేదు. కొత్త వాస్తవాలు కనబడితే పాత ఆలోచనలను మార్చుకొనడానికి సిద్ధంగా ఉండాలి. కృష్ణమూర్తిగారన్నట్టు ప్రజలలో పెరిగే అసంతృప్తి, పెరుగుతున్న పోరాటాలకు ఒకదారీ, తెన్నూ చూపే ఉద్దేశ్యంతో ఇటువంటి చర్చలు జరగాలని కోరుతున్నాను. ❑

# భూమిని పీల్చేస్తున్న కార్పొరేట్ ధనతృష్ణ

- కొణతం దిలీప్

**భూ**గోళంపై మంచినీటి కొరత ముంచుకొస్తోంది. పెరిగిపోతున్న కాలుష్యం, తద్వారా వాతావరణంలో సంభవిస్తున్న మార్పులు, వీటన్నింటినీ మించి బహుళ జాతి కంపెనీల ధనతృష్ణ భూమిని తీవ్రమైన మంచినీటి సంక్షోభం దిశగా నెట్టివేస్తున్నాయి.

'వచ్చే శతాబ్దంలో నీటి కొరకు యుద్ధాలు జరుగుతాయి' అన్న ప్రపంచ బ్యాంక్ జోస్యం నిజమయ్యే సూచనలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

అసలు భూమిపై ఉన్న నీటి వనరులెన్ని? ఈ నీటిపై హక్కులు ఎవరివి? సామాన్యుడికి తాగేందుకు గుక్కెడు నీళ్ళు కూడా కరవు కావడం వెనుక ఉన్న రాజకీయార్థిక కారణాలేమిటి? ఏ అదృశ్య శక్తులు ఈ దుస్థితికి కారణం? వంటి ప్రశ్నలకు జవాబులతో 'బ్లూ గోల్డ్' అనే కొత్త పుస్తకం విడుదలైంది. కెనడాకు చెందిన మాడ్ బార్లో, టోనీ క్లార్క్ అనే ఇద్దరు ఉద్యమకారులు రాసిన ఈ చక్కటి పుస్తకం-ప్రపంచాన్ని కుదిపేయగల మంచినీటి సంక్షోభం గురించి, ఈ పరిస్థితికి ముఖ్యకారణమైన బహుళజాతి కంపెనీల నీటి దోపిడీని గురించి సమగ్రంగా తెలియజేస్తుంది.




ప్రతి మనిషికీ ప్రాథమిక అవసరమైన మంచినీరు ఇవ్వాళ అంగట్లో అమ్మే సరుకైపోయింది. ఒక దేశమని లేదు, ఒక ప్రాంతమని లేదు. మంచినీటి సమస్య ఇవ్వాళ ప్రపంచ ప్రజలందరి సమస్య.

అయితే ఈ సమస్యను ఎదుర్కోవలసిన ప్రభుత్వాలు మాత్రం బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్నాయి. ఉన్న కొద్దిపాటి మంచినీటి వనరులనూ బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేస్తున్నాయి. కానుల వోజులో వడ్డ ఈ కంపెనీలు వర్యవననాలు పట్టించుకోకుండా భూమిని పీల్చి పిప్పి చేస్తున్నాయి. నీటికి వెలగట్టి, అంగడి సరుకుగా మార్చి వేలకోట్లు వెనకేసుకుంటున్నాయి.

భూమిపై ఉన్న మంచినీటి నిల్వలు మూడుకోట్ల అరవై లక్షల ఘన కిలోమీటర్లు (అంటే కిలోమీటరు పొడవు, వెడల్పు, లోతు) గా అంచనా వేయబడ్డాయి. అయితే ఈ నీటిని మనం తోడేస్తున్నంత వేగంగా మళ్ళీ భర్తీ చేయలేకపోతున్నాం. ప్రస్తుతం ఉన్న కొద్దిపాటి నీటి నిల్వలూ తీవ్రమైన కాలుష్యానికి గురవుతున్నాయి.

పారిశ్రామిక రంగం వదిలే రసాయినిక వ్యర్థాలూ, వ్యవసాయంలో విచక్షణా రహితంగా వాడబడుతున్న పురుగు మందుల అవశేషాలూ, మానవ విసర్జితాలూ-వీటన్నిటి మూలంగా మంచినీటి వనరులు తీవ్రంగా కలుషితం అవుతున్నాయి.

- ఢిల్లీ నగర మురుగునీటి పారుదల వ్యవస్థ ప్రతినిత్యం ఇరవైకోట్ల లీటర్ల మలినాలను యమునా నదిలో కలుపుతోంది.
- కెన్యా, టాంజానియా, ఉగాండా దేశాలకు చెందిన నగరాల నుండి కోట్లాది లీటర్ల మురుగు నీరు ప్రవహించి విక్టోరియా సరస్సును మురికి గుంటలా మార్చేసింది.
- ఎంతో అభివృద్ధి చెందిన కెనడాలోనూ ఇదే తంతు. ఏటా ఒక వెయ్యికోట్ల లీటర్ల మురుగునీరు వివిధ మంచినీటి ప్రవాహాల్లో కలుస్తోందిక్కడ.

మంచినీటి నిల్వలు హరించుకు పోవడంలో వ్యవసాయ రంగం పాత్ర కూడా చాలా ఉంది. 1800వ సంవత్సరంలో కేవలం ఎనభై లక్షల హెక్టార్ల భూమికి మాత్రమే సాగునీటి వసతి ఉండగా నేడది ఇరవై నాలుగుకోట్ల హెక్టార్లకు పెరిగింది. అభివృద్ధి చెందిన దేశాల వ్యవసాయ రంగంలో నీటి వినియోగం దారుణంగా ఉంది.

- ఒక టన్ను గొడ్డు మాంసం తయారు చేయడానికి పదిహేను వేల టన్నుల నీళ్ళు వినియోగించబడుతున్నాయి.
- ఒక టన్ను ప్రత్తి ఉత్పత్తి చేయడానికి కూడా దాదాపు అదే పరిమాణంలో నీరు అవసరం.
- అదే ఒక టన్ను గోధుమలు లేదా సోయాబీన్స్ పండించడానికి 300 టన్నుల నీరు సరిపోతుంది.

అవసరానికి, మనుగడకోసం పంట పండించడం స్థాయి నుండి వాణిజ్య సరళిలోకి మారిన వ్యవసాయరంగం వనరుల దుర్వినియోగానికి కారణభూతమౌతుంది.

వ్యవసాయానికి నీటి సౌకర్యం కల్పించడం, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడం అనే జంట లక్ష్యాలతో మొదలైన ఆనకట్టల నిర్మాణం పర్యావరణానికి చేసిన హాని అంతా ఇంతా కాదు. 20వ శతాబ్దంలో దాదాపు 8,00,000 చిన్న ఆనకట్టలు, 40,000 పెద్ద ఆనకట్టలు నిర్మించబడ్డాయి.

లక్షలాది మంది ప్రజలను అదీ ముఖ్యంగా గిరిజనులను నిర్వాసితులను చేసి, నదుల సహజ ప్రవాహాలను నియంత్రించి విలువైన అటవీ సంపదను, అరుదైన జంతు జాలాన్ని, ఎంతో పురావస్తు సంపదను బలి పెట్టిన ఈ ఆనకట్టల వల్ల ఒనగూరిన ప్రయోజనాల కన్నా వాటిల్లిన నష్టాలే ఎక్కువ.

అంతర్జాతీయ మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో ప్రతీది కొనుక్కొంటే దొరికేదే. ఒకప్పుడు మనం ఎంతో పవిత్రంగా భావించిన విద్య, ఆరోగ్యం, సంస్కృతి, సహజవనరులు, విత్తనాలు, గాలి, నీరు-ఇప్పుడు అన్నీ అంగట్లో అమ్మకానికి పెట్టబడ్డాయి.

ఎప్పుడైతే అమ్మకాలు మొదలయ్యాయో అప్పుడు బహుళజాతి కంపెనీల డేగకళ్ళు విలువైన మంచినీటి నిల్వలపై పడ్డాయి. ఎప్పుడైతే కొనుగోలు మొదలైందో అప్పుడు సామాన్య మానవుడికి మంచినీటిపై ఇదివరకు ఉన్న గౌరవం పోయింది.

దశాబ్దాలుగా వ్యాపారాలను విస్తరింపజేసుకొని, ఖండాంతరాలకు వ్యాపించిన బహుళజాతి కంపెనీలు ఇప్పుడు నీటి వ్యాపారంపై దృష్టి సారించాయి. ఐ.ఎం.ఎఫ్, ప్రపంచబ్యాంక్, డబ్ల్యు.టి.వో వంటి ముసుగు ఆర్థిక సంస్థల మద్దతుతో ఈ కంపెనీలు అనేక దేశాల్లో మంచినీటి వ్యాపారానికి తెర తీసాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆర్థిక సహాయం పేరిట ప్రపంచబ్యాంక్, ఐ.ఎం.ఎఫ్ వత్తిడి చేసి అక్కడి నీటి సరఫరా వ్యవస్థను పాక్షికంగా లేదా పూర్తిగా ప్రైవేటీకరించి బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పడం జరిగింది. ప్రస్తుతం వివెండీ, సుయెజ్ అనే రెండు ఫ్రెంచి కంపెనీలు ఈ తరహా నీటి వ్యాపారంలో అగ్రస్థానంలో ఉన్నాయి. ఇవి రెండూ కలిసి దాదాపు 130 దేశాల్లో నీటి సరఫరా సంబంధిత వ్యాపారం నిర్వహిస్తున్నాయి.

'ఇరవయ్యో శతాబ్దికి చమురు ఎలాగో ఇరవై ఒకటో శతాబ్దానికి నీరు అలాగ' అని ఫార్చ్యూన్ పత్రిక కొన్నాళ్ళ క్రితం రాసింది. అదిప్పుడు అక్షరసత్యం అయ్యే సూచనలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ప్రపంచ నీటి మార్కెట్ విలువ దాదాపు నాలుగు లక్షల కోట్ల డాలర్లుగా అంచనా వేస్తున్నారు. త్వరలోనే ఇది కోట్ల కోట్ల డాలర్ల వ్యాపారం కాగలదని అంచనా.

నీటి సరఫరా ప్రైవేటీకరించే ముందు ప్రతీచోటా ఆర్థిక సంస్థలు సబ్సిడీలు ఎత్తివేయాలనీ, బిల్లులు అందరి దగ్గరా సక్రమంగా వసూలు చెయ్యాలనీ, ధరలు తగ్గించి వినియోగం ఎక్కువ జరిగేలా చూడాలనీ చెప్తాయి. కానీ వాస్తవంగా జరిగేది మాత్రం భిన్నంగా ఉంటుంది. నీటి సరఫరా ప్రైవేటీకరించబడిన దేశాల్లో కొన్ని చోట్ల నీటి సరఫరా అయితే మెరుగుపడింది కానీ ఛార్జీలు మాత్రం విపరీతంగా పెరిగాయి. పేదవాడికి గొంతు తడుపుకోవడానికి నీళ్ళు కరువయ్యాయి.

బొలీవియా రాజధాని కొచబంబాలో బెక్టెల్ అనే కంపెనీ చేతికి నీటి సరఫరా రాగానే పెరిగిన ఛార్జీలకు వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా ఆందోళనలు, ఘర్షణలూ చెలరేగాయి. ప్రజావ్యతిరేకత చూసి జడిసిన బెక్టెల్ అక్కడి నుండి అయితే నిష్క్రమించింది కానీ ప్రపంచబ్యాంక్ ఇంటర్నేషనల్ సెంటర్ ఫర్ ఇన్వెస్ట్‌మెంట్ డిస్ప్యూట్స్ అనే న్యాయస్థానంలో బొలీవియా ప్రభుత్వంపై నాలుగు కోట్ల డాలర్ల భారీ నష్టపరిహారం కేసు వేసింది. ఇలాంటి కేసుల్లో చివరికి ఏం జరుగుతుందో వేరే చెప్పక్కరలేదు కదా!

సామాన్యంగా ఏ నగరంలోనైనా సరఫరా అయిన నీటిలో 60-70 శాతం పరిశ్రమలే. వినియోగించుకుంటాయి. 20-25 శాతం వివిధ సంస్థలు వినియోగిస్తే సామాన్య జనం కేవలం 10 శాతం లోపే వినియోగించుకుంటారు. వాస్తవం ఇదైతే-సామాన్యజనం సరిగా చార్జీలు చెల్లించకనే ప్రభుత్వ నీటి సరఫరా సంస్థలు నష్టాలు ఎదుర్కొంటున్నాయనీ- అందుకే బిల్లులు సరిగా వసూలు చేయడానికి వాటిని ప్రైవేటీకరించాలనీ ఆర్థిక సంస్థల, ప్రభుత్వాల వాదన ఎంత మోసపూరితమో కదా!

ప్రపంచీకరణ పేరిట కొన్ని అభివృద్ధి చెందిన దేశాలూ, గుప్పెడు బహుళజాతి కంపెనీలూ కలిసి మిగతా ప్రపంచ దేశాల పొత్తును కొల్లగొట్టడానికి అయిదు వందల ఏళ్ళ క్రిందనే బీజాలు పడ్డాయి. అప్పుడు వాణిజ్యం పేరిట ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికా ఖండాల్లోని దేశాల్లోకి ప్రవేశించి అక్కడి సహజ వనరులైన బంగారం, వెండి, ఇత్తడి వంటివి కొల్లగొట్టారు. మారిన పరిస్థితులూ, టెక్నాలజీల పుణ్యమా అని కొత్త వనరులు కొల్లగొట్టడానికి బహుళజాతి కంపెనీలు, అభివృద్ధి చెందిన దేశాలూ కలిసి ఇప్పుడు ప్రపంచీకరణ అనే కొత్త దోపిడీ మార్గం కనిపెట్టాయి.

ఇవాళ బహుళజాతి కంపెనీలు ప్రపంచాన్నే తమ గుప్పెట్లోకి తెచ్చుకున్నాయి. వాషింగ్టన్‌లోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ పాలసీ స్టడీస్ నివేదిక ప్రకారం ప్రపంచంలోని 200 అతి పెద్ద బహుళజాతి కంపెనీల అమ్మకాలు 182 ప్రపంచదేశాల ఆర్థిక వ్యవస్థల కంటే ఎక్కువ! ప్రపంచంలోని 100 అతిపెద్ద ఆర్థిక వ్యవస్థల్లో 53 బహుళజాతి కంపెనీలే అంటే వీటి శక్తి ఏమిటో అర్థం చేసుకోండి.

నీటి ప్రైవేటీకరణ మూలంగా సామాన్యుడికి నీటి లభ్యత తగ్గిపోతుంది. ధనికుల కాలనీల్లోకి ప్రవేశించే ప్రైవేటు నీళ్ళు పేదవాడి గుడిసెల్లోకి మాత్రం చేరట్లేదు. ఫలితం పేదలు అతి ఎక్కువ ధరకు క్యాన్లలో నీరు కొనుక్కోవలసి రావడం.

ప్రజలూ, ప్రజా సంఘాలు, ఈ పరిస్థితిల్లో మార్పు కోసం కృషి చేయాలి. బొలీవియాలోనూ, ఇతర వదేశాల్లోనూ నీటి ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉద్యమించిన వారిని ఆదర్శంగా తీసుకుని ప్రజలను చైతన్యవంతులను చేయాలి.

నీరు ఏ ఒక్కరి గుత్త సొత్తూ కాదనీ, అది భూమి మీద ఉన్న సమస్త జీవరాసుల హక్కు అనీ ఎలుగెత్తి చాటాలి. చేయి చేయి కలిపి బహుళజాతి కంపెనీల ధన దాహానికి అడ్డుకట్ట వేయాలి.



# ధనస్వామ్య సంస్కృతి

- ప్రేమ్‌చంద్

ప్రపంచ ప్రఖ్యాత ఉర్దూ, హిందూ రచయిత ప్రేమ్‌చంద్ 1936 సెప్టెంబర్‌లో రాసిన వ్యాసం ఇది. రాసి డబ్బై సంవత్సరాలు కావస్తున్నా, చాల తాజాగా, ఇవాల్టి పరిస్థితులపై రాసినట్టుగా కనబడుతున్న ఈ వ్యాసాన్ని పునరుక్తిగా అచ్చువేస్తున్నాం-సం)

భూస్వామిక వ్యవస్థలోనూ రాచరిక విధానంలోనూ ధృఢమైన హస్తాలూ ధీరహృదయమూ జీవిత ఆవశ్యకాలను కునేవారు. బుద్ధిబలం, వచశ్శక్తి, అధికారమంటే అచంచలమైన విధేయత ముఖ్య మనిపించుకునేవి. ఈ వ్యవస్థలో ఈ విధానంలో లోపాలెన్నైనా వుండవచ్చుగాని, మంచి లక్షణాలు పూర్తిగా లేకుండా పోలేదు, ఒకానొక జాగీర్దారు తన ప్రతీకారాన్ని శత్రు రక్తంతో చల్లార్చుకోగోరి వుండవచ్చు గాని, మిత్రుని కోసమో హితుని కోసమో తన ప్రాణాన్ని తృణంగా సమర్పించనూవచ్చు. రాజు సంకల్పించిందే చట్టం. దాని అతిక్రమణను అతగాడెన్నడూ క్షమించి వదలడు. అయినా పాలితుల శ్రేయస్సు కోసం పాటుబడేవాడు. న్యాయపాలనలో నిష్పక్షపాతంగా వ్యవహరించేవాడు. మరోదేశం మీద దండయాత్ర చేసాడంటే వారి అపరాధాన్ని దండిద్దామనో, పగ తీర్చుకుందామనో, లేక రాజోచితమైన తన ప్రతిష్ఠని నిలుపుకుందామనో, అదీగాకపోతే అన్యదేశాలను పౌరులతో జయించి తన సామ్రాజ్యాన్ని విస్తరింపజేద్దామనో అలా జరిగేది. ఈ దండయాత్ర లక్ష్యం తన పౌరులను దోపిడీ చేయడమైవుండదు. రాజులూ, చక్రవర్తులు తమతమ స్వార్థ ప్రయోజనాల సాధనకు గానీ ధనాన్ని ఆర్జించడానికి గాని జన సామాన్యాన్ని యుద్ధరాక్షసికి చిరుదిండిగా అర్పించేవారు కాదు సరిగదా, వారు ప్రజల సుఖదుఃఖాలలో పాలుపంచుకొని, వారి శక్తి సామర్థ్యాలకు ఇవ్వవలసినంత ఇచ్చేవారు.

అయితే ఈనాటి షావుకార్ల వ్యవస్థలో ధనమే పరమార్థమై పోయింది. ఒకానొక దేశాన్ని పాలిస్తున్నామంటే వడ్డీ-వ్యాపారులకూ పెట్టుబడిదారులకూ అంతుపొంతులేని లాభాలను సమకూర్చిపెట్టడానికే. దీని దృష్ట్యా, వడ్డీ వ్యాపారులే నేడు ప్రపంచ పరిపాలకులనడం సబబైన మాట. మానవ సమాజం రెండుగా చీలింది. చాలా ఎక్కువభాగం తను చెమటకార్చి కాయకష్టం చేస్తూంటే, చాలా స్వల్పభాగం తన అధికారం, పలుకుబడి మూలంగా తక్కిన సమాజాన్ని తన వుక్కు పిడికిట్లో నొక్కి వేస్తూంది. ఈ అధిక సంఖ్యాకుల పట్ల దానికి సానుభూతిగాని జాలిగాని లేవు. వీరు వుండేదల్లా యజమానులకోసం చెమటోడ్చేందుకూ, రక్తంచిందించేందుకూ ఆ తర్వాత ఏదో ఒకరోజున ఈలోకాన్ని విడిచి వెళ్లేందుకూ అన్నమాట. విచారకరమైన విషయం ఏమిటంటే ఇలాంటి ఆలోచనాసరళి పాలకవర్గానిదే అయినా పాలితుల భావాలలోకి గూడా ఇది దూరగలడమే. ఫలితం ప్రతివ్యక్తీ క్రూరజంతువుగా మారి సమాజాన్ని వేటాడి చంపబూనుతాడు. దానితో తనకున్న ఏకైక సంబంధం ఏమిటీ అంటే, ఎలాగో దాని కన్ను గప్పి దానివల్ల వీలైనంత ఎక్కువ ధనం రాబట్టుకోవడానికి ఏదో యుక్తినీ పన్నాగాన్నీ ప్రకటించడమే.

ధనంకోసం ఈ పేరాశ తతిమా మానవ గుణాల నన్నిటినీ లోబరచుకుంది. ఒకరి సాంఘిక అంతస్తునీ ఒకరి సామర్థ్యాన్నీ నిర్ణయించేది ధనం ఒక్కటే. నీ హృదయం ఎంత కారు నల్లటిదైనా గానీ, ధనముంటే చాలు, నువ్వు దేవుడివి కాగలవు. ధనదేవత బలివేదిక ముందు నిలిచి సాహిత్యమూ సంగీతమూ కళా తలలు వంచి పూజ చెయ్యవలసిందే. తేలికగా వూపిరిపీల్చుకోజాలనంతగా కలుషితమౌతూంది ఈ వాతావరణం. డాక్టరేగాని, హకీమేగాని తను కోరే విపరీతమైన ఫీజు చేతికి రాందే రోగి కేసి చూడనైనా చూడడు, పలుకనైనా పలుకడు. లాయరు ప్రతి నిముషాన్నీ రూపాయణా పైసల రూపంలోనే చూస్తాడు. శక్తి సామర్థ్యాలను సక్రమంగా నిర్ధారించేది వాటి బజారు విలువను బట్టే. మౌల్వీ లూ పండిట్ లూ ఇష్ట పూర్తిగానే ధనికులకు వూడిగం చేస్తారు-"పసిడి గల్గువాని బానిస కొడుకులు". వార్తా పత్రికలు ఆలపించేది ధనం రాగాన్నే. ఎటువైపునుంచైనా సరే దాని ఆధిపత్యాన్ని ఎదుర్కోవడం ప్రమాదమై పోయేంతగా ఇది మనిషి మనస్సునీ హృదయాన్నీ అధీనం చేసుకుని వుంటూంది. ప్రేమ, కరుణ, నిజాయితీ, సాధుత్వం- ఇలాంటివన్నీ తనలో గూడుగట్టుకుని వున్నాయని ఒకనాడనుకున్న మనిషి, దయాదాక్షిణ్యాలంటే ప్రేమాభిమానాలంటే యేమిటో గూడా తెలీని ప్రాణరహితమైన యంత్రంలా రూపొందాడు. ఈ ధనస్వామ్య

నాగరికత కొత్త కొత్త నియమ నిబంధనల మీద ఆమోద ముద్ర వేసింది. వాటి ప్రకారమే ఈనాడు సమాజం నడుచుకుంటూంది. అలాంటి సూత్రాలలో ఒకటేమిటంటే, కాలం అంటే ధనం. ఒకప్పుడు కాలం అంటే జీవితం. విద్యా సంస్కృతుల సముపార్జనకో, పేద సాదల సేవకో అనాథల సంరక్షణకో, ఒక వుదాత్తమైన ప్రయోజనానికి అది వినియోగపడేది. మరి ఈ రోజుల్లో ధనార్జనకు వినియోగపడడంకంటే దానికి వుదాత్తమైన వినియోగమేదీ లేకుండా వచ్చింది. డాక్టరు గారి చేతివేళ్లు రోగి నాడిమీద వుండవచ్చు గాని అతని కళ్లు మాత్రం చేతి గడియారానికి అతుక్కున్నట్టుంటాయి. గడిచే ప్రతినిముషం అతని కంతగణన అని అర్థం. రోగి ఒక రూపాయి తీసి ఇస్తే, నిమిషం మించి అతన్ని చూడడం జరగదు. లేవు. ప్రతి ఒక్కడూ ఏం చేస్తున్నాడో తానూ అదే చేస్తున్నాడాయె! మనిషి పరులనుంచి కోరుకునేవాటిలో కీర్తి ప్రతిష్ఠలు ముఖ్యం. ఇది నాటిదీ నేటిదీ కాదు ప్రఖ్యాతి పొందటానికి పాండిత్యమో కళో మార్గమైన కాలంలో, జనం వీటిమీదనే గురిపుంచేవారు. ఆ గమ్యం చేరటానికి ఏకైక మార్గం ఈ కాలాన ధనమే అయికూర్చున్నప్పుడు, మనిషి దాన్ని పూజించక తప్పదు. తాను సాధువో మహాత్ముడో సన్యాసో తాపసో కాదు గనక, తానిప్పుడు మెట్టుతూన్న చక్కని రాజమార్గాన్నే తమ తమ వృత్తులలో ఘటికుల మనిపించుకున్న వారంతా ఒకనాడు ప్రయాణంచేసి పైకి వచ్చిన వాళ్లేనని తనకు తెలీకపోదు. విజయం పొందిన మనిషికి కాలమే ధనం. ఈ సూత్రాన్ని అనుసరిన్తూ విజయం పొందినవాడి

**కాలమంటే ధనం గదా మరి? ఆ ధన-ఆరాధన స్నేహానికీ మానవీయతకీ వుండిన అర్థాన్నంతటినీ వొలిచి పారేసింది. మిత్రుల్నీ, బంధువుల్నీ అటుంచుదాం, ఆలుబిడ్డలతో కాస్త హాయిగా పొద్దు పుచ్చేందుకు గూడా భర్తగారికి టైం చాలదు. వారితో ముచ్చట్లాడిన సమయంలోనే మరో పనిచేస్తే ఎంత సంపాదించి వుండవచ్చో! ఏదో సంపాదించడానికి ఖర్చు చేసిన కాలానికే సార్థకత వుంటుంది. లేకుంటే తాను సదవకాశాన్నల్లా పాడు చేసుకున్నట్టే. తిండీ తీరుబాటూ తప్పని సరికదా, వాటికోసం "అమూల్యమైన" తన కాలాన్ని వృధా చెయ్యక తప్పదు, పాపం.**

తన సాదనంతా వినిపించాలని రోగి కుంటుంది. గాని ఉదార పురుషుడైన వైద్యుడి చెవి కెక్కదు. ఏ మాత్రం ఆసక్తీ లేదతనికి. తన చూపుకి, రోగి ప్రతిఫలం రాబట్టుకోదగిన శరణార్థి మాత్రమే. ఏదో ప్రిస్క్రిప్షన్ గీకి, మరో రోగివద్దకు పోతాడు. పాఠాలు చెప్పిపోయేందుకు వచ్చే ట్యూటరు ఒక గంటసేపు కూర్చోవాలి. అలా కూర్చున్నంతకాలం చేతి గడియారం అతగాడి ముందుంటుంది. విద్యార్థి సగం పాఠమే చదివాడనుకోండి, ట్యూటరు కేమీ పట్టదు. ఆ గంట అయిందో లేదో, పైకి లేస్తాడు. గంటసేపటి కంటె ఎక్కువకాలం తానెలా వుండగలడు- కాలమంటే ధనం గదా మరి? ఆ ధన-ఆరాధన స్నేహానికీ మానవీయతకీ వుండిన అర్థాన్నంతటినీ వొలిచి పారేసింది. మిత్రుల్నీ, బంధువుల్నీ అటుంచుదాం, ఆలుబిడ్డలతో కాస్త హాయిగా పొద్దు పుచ్చేందుకు గూడా భర్తగారికి టైం చాలదు. వారితో ముచ్చట్లాడిన సమయంలోనే మరో పనిచేస్తే ఎంత సంపాదించి వుండవచ్చో! ఏదో సంపాదించడానికి ఖర్చు చేసిన కాలానికే సార్థకత వుంటుంది. లేకుంటే తాను సదవకాశాన్నల్లా పాడు చేసుకున్నట్టే. తిండీ తీరుబాటూ తప్పని సరికదా, వాటికోసం "అమూల్యమైన" తన కాలాన్ని వృధా చెయ్యక తప్పదు, పాపం.

బస్తీలోవున్న నీ మిత్రుడు, లేదా నీ బంధువు సుప్రసిద్ధుడయ్యాడా, మరి అతగాణ్ణి నువ్వు పోగొట్టుకున్నావని నిశ్చయంగా అనుకోవచ్చు. ముందు ఒక కార్డురాసి లోనికి పంపందే ఆ ఇంటిలోకే నీకు ప్రవేశం ఉండదు. ఆ పెద్దమనిషి ఎన్ని పనులూ ఎన్ని పనులూ- నీ కోసమని ఒకటి రెండు క్షణాలకంటె అదనంగా ఖర్చు చెయ్యలేడు; లేదూ, తనకు టైము లేదని నీముఖాన్నే అనేసినా అనెయ్యగలడు, ఇప్పుడతగాడు ధనానికి భక్తుడు. స్నేహం, మర్యాదా మప్పితాలూ- ఈ మాటకు అర్థమే మరచిపోయి వుంటాడు.

నీకు లాయరైన స్నేహితుడున్నాడనుకో, నువ్వు వ్యాజ్యంలో తగులుకున్నావనుకో, అతని నుంచి ఎలాంటి సాయాన్నీ ఆశించకుమా! నీ బాధలపట్ల అతగాడు ఈ పాటికే ఏ ఆసక్తీ చూపక దానికి గుడ్‌బై కొట్టకపోయి వుండకుంటే, డబ్బు విషయం ఎత్తకపోవచ్చు గాని నీ కేసుని శ్రద్ధగా పట్టించుకోడు. ముక్కూ మొగమూ తెలీని మరో లాయరు వద్దకు వెళ్లి అతని కివ్వాల్సిన ఫీజు ఇచ్చుకోవడమే మేలు. ఏ రంగంలోనైనా ఒక వ్యక్తి సమర్థుడు కాకుండా దేవుడే కాపాడాలి. అలా అయ్యాడా, అతగాడిలో మరి సహజ మానవానుభూతులన్నీ మటుమాయమయ్యాయన్నమాటే. ఎంచేతనంటే, "సమయ మమూల్యము".

పిచ్చాపాటితో పొద్దు పుచ్చమని ఎవరూ అనడం లేదు. స్నేహం, అభిమానం, సానుభూతి-ఇలాంటి అనుభూతులన్నిటినీ తన్ని తగలేసేంతగా ధనాసక్తిని ముదరనివ్వగూడదు.

అయినా, ధనానికి బానిసగా మారినవాణ్ని నువ్వు ఖండించ

అడుగుజాడల్లో నడిచిపోయేవాణ్ణి. మరొకడు చూసి ఎలా తప్పెన్నగలడు? కీర్తి ప్రతిష్ఠలకోసం మనిషికిగల అభిలాషను మనస్సు మీదినుంచి తుడిచి పెట్టలేవు. ధనం లేనివాళ్లు- కాలాన్ని ధనమనుకోలేదు గనకనే వీరి కాధనం లేదు-వట్టి పనికిమాలిన వాళ్లని తన కనిపిస్తారు. తమ వృత్తిలో తాము దక్షులే కావచ్చుగాక, అయినా వీరి గురించి ఎవరు గొప్పజేసి వస్తారు? జీవితమంటే ఏ కొద్దిపాటి వుత్సాహం గలవాడెవడైనా ఇలా నిర్లక్ష్యాన్నీ విస్మృతినీ సహించలేడు. సానుభూతీ స్నేహమూ పెద్ద మనిషితనమూ వగైరా మనోభావాలను నిర్దాక్షిణ్యంగా తోసేసి, బుద్ధినీ హృదయాన్నీ లక్ష్మీపూజకు మాత్రమే అర్పించుకోవాలి. అప్పుడే ధనలక్ష్మి అతన్ని కటాక్షిస్తుందని అతని ఆశ. ఇష్టాపూర్తిగా ఎవడూ దీనికి పూనుకోడు. ఇది అతగాడి మీద బలవంతంగా మోపడం జరుగుతుంది. ధనాన్ని తెచ్చి పెట్టేదాని మీద తప్ప తక్కిన దేనిమీదా మనస్సుపోని విధంగా అది నియంత్రిత మౌతుంది. దురదృష్టంకొద్దీ అర్థగంట కాలం ఏ సభలోనో ఉపన్యాస కార్యక్రమంలోనో తాను కూర్చోవలసివస్తే, పాపం ఇది అతనికి బలవంతపు మాఘస్నానమో విడిఖైదో అనిపిస్తుంది. మానసికమైన, అనుభూతి పరమైన, సాంస్కృతికమైన అతని శ్రద్ధాసక్తులన్నీ ఏకైకమైన బిందువుమీద లగ్నమైవున్నాయి. అలా ఎందుకు జరగ్గూడదు? ధనాన్ని తప్ప మరి దేన్నీ తాను నమ్మికోలేడు. అతగాడి ఆప్తమిత్రులు తమకేదో కావలసి వచ్చేప్పుడే అతని వద్దకు వస్తారు. అతని ధనమే బంధువులందరికీ ఆకర్షణ. తానే పేదవాడై వుంటే, ఇప్పుడు తనను ముట్టడిచేస్తున్న మిత్రుల్లో ఒక్కరైనా తన ముఖం చూపించేవారేనా? ఇందరు చుట్టపక్కాల్లో ఒకరైనా తనవద్దకు వచ్చేవారేనా? సమాజంలో తనదైన స్థానాన్ని తానే సిద్ధపరచుకోవాలి. ముసలితనంలో పనికి వచ్చేందుకు ఎంతో కొంత వెనకేసుకోవాలి. తన బిడ్డలు దిక్కుమాలి బిచ్చమెత్తకుండా వుండాలంటే ఎంతో కొంత దక్కించాలి. హృదయం లేని ఈ క్రూరమైన ప్రపంచం విషయంలో తనకు స్వానుభవం పుష్కలంగా వుంది. మనిషి గుండె ధైర్యాన్ని, సంకల్ప బలాన్నీ దెబ్బతీసి, మానవ సహజమైన ఆశలనూ వాంఛలనూ నులిమి చిదిమివేసే సంకట పరిస్థితులను తన కుమార్లు ఎదుర్కోవలసి రాగూడదు. జీవిత ప్రయాణంలో ఎన్నెన్నో మైలురాళ్లు దాటవలసి రావచ్చు. వ్యాపార సరళిలో ముందుకు సాగితే తప్ప తాను ఏ మైలురాయీ దాటలేడు.

వ్యాపారమంటే వ్యాపారమేననేది ఈ నాగరికత రెండోసూక్తి. వ్యాపారంలో మానవానుభూతులకూ ఉద్రేకాలకూ జాగాలేదు. వెనకటి జీవన సూత్రాలు ఇలాంటి మొదటి సూటిదనం గురించి బడాయి చెప్పుకునేవి కావు. దీన్ని నిర్లజ్జ అనవచ్చు. ఈ సరికొత్త సూత్రానికి ప్రాణమూలమంతా ఇదే. ఇది డబ్బుతో, గట్టి రొక్కంతో వ్యవహరిస్తున్నప్పుడు, స్నేహమూ సానుభూతీ దయాలాంటి వాటికి మినహాయింపు లివ్వడం కుదరదు. వ్యాపారంలో స్నేహమేమిటి? ఎవడైనా ఒకడు ఈ పరమ సూత్రాన్ని ఆశ్రయించాడో ఇక నువ్వు చెప్పవలసిందేదీ వుండదు. నీ నాలుక ఆడదు. పరిస్థితులు ఒక మనిషిని తన నేస్తమే అయిన ఒకానొక వడ్డీ వ్యాపారి వద్దకు నెట్టుతాయనుకుందాం. వెళ్లిన మనిషికి తాను ఒడ్డున బడగలనని ఆశ వుండవచ్చు. అధమ పక్షం చేబదులో లేక తక్కువ వడ్డీరేటో దక్కుతుందనీ భ్రమపడవచ్చు. ఆ రుణదాత మామూలు వ్యాపార సరళిలోనే మాటాడ్డం మామూలు. ఏదో ఒకరాయితీ ఇమ్మని ప్రార్థనాపూర్వకంగా అతగాడడుగుతాడు. జాలి బుట్టించే కంఠస్వరంతో నీళ్లు నిండిన కళ్లతో, "అయ్యో, ఇలాంటి ఇక్కట్లు దాపురించకపోతే, మీకు ఇబ్బంది కలిగించాలని కలలోనైనా నేననుకొని వుండను. దేవుణ్ణి జూచి ఈ దీనుణ్ణి కనికరించండి. పాతస్నేహితుడు గదా అని.. " అంటాడనుకుందాం. మాట పూర్తి జెయ్యకముందే ఆ మహాశయుడు "వ్యాపారం వ్యాపారమేనన్న వాస్తవాన్ని మీరు మరుస్తున్నార్లాగుంది" అంటాడు. ఈ మాటలు అవతలి వాడికి పిడుగుపాట్లు. తనకు మరో వాదమేదీ లేదిక. .నెమ్మదిగా పైకిలేవనన్నా లేస్తాడు లేదా వ్యాపార సరళి వదలని మిత్రుడు పెట్టే షరతుల కన్నిటికీ ఒప్పుకుంటాడు.

ధనస్వామ్య సంస్కృతి జనంలో బాగా ప్రచారం చేసిపెట్టిన కొత్త విధానాలలో సూత్రాలలోకెల్లా పరమ విషతుల్యమైందీ ఘోర రక్త దాహం గలదీ "వ్యాపారమంటే వ్యాపారమే" ననేది. భర్తకూ భార్యకూ మధ్య, తండ్రికీ కుమారుడికీ మధ్య, అధ్యాపకుడికీ విద్యార్థికీ మధ్య- వ్యాపారం! మనుషుల మధ్యగల ఆత్మీయమైన సాంఘిక సంబంధాలన్నిటికీ స్వస్తి. మనిషికీ మనిషికీ మధ్య ఇంకా ఏదైనా సంబంధం మిగిలి వున్నదంటే, అది ఈ వ్యాపార సంబంధం ఒక్కటే. ఈ "వ్యాపారం" మొఖంమండ! దురదృష్టవంతురాలైన ఆడపిల్ల అవివాహితంగా వుంటూ, తన బతుకుదెరువు తానే సంపాదించుకోజాలకపోతే, తన తల్లిదండ్రుల గృహంలోనే తాను దాసీపిల్ల స్థాయిలో జీవించవలసిందే. ప్రతి కుటుంబంలోనూ కొడుకులూ కూతుళ్లూ ఇంటి పనులు తలా ఒకటి చేసుకుంటారు. వాళ్ల నెవ్వరూ సేవకులనరు. కాని, ఈ ధనస్వామ్య వ్యవస్థలో కొంతప్రాయం మీరిన ఆడపిల్లకు తన సొంత అన్నదమ్ములకే పని పిల్లగా పరిచారికగా తప్ప పరిగణన లేకుండా వచ్చింది. ఒకప్పుడు భయ భక్తులు పొందిన తండ్రి, తన విధులు తాను నెరవేర్చుకుపోయే

కుమారుడికి పనిమనిషతున్నాడు. కన్నతల్లి తన సంతానానికే వూడిగం చేస్తున్నది. మిగతా బంధువుల విషయం ఎంతకొద్దిగా చెప్పడం అంతమంచిది. చుట్టంగా వచ్చిన సోదరుణ్ణి అతిథిలా సమాదరిస్తున్నారు. వారి ఆతిథ్యానికి బదులుగా తాను ఎంతో కొంత ముట్టజెప్పవలసి వస్తున్నది. ఈ సంస్కృతి మూలమల్లా వ్యక్తివాదం- ఎవడి గతి వాడిదే వెనకబడ్డవారు పిశాచివాత బడినాసరే.

అయితే ఈ విషయంలో ఎవరినీ తప్పెన్నడం కుదరదు. పేరు ప్రఖ్యాతుల దుగ్ధ, రానున్న రోజుల గురించి చింత, ఇంటిపెద్ద గతించాక అతగాని ఆలుబిడ్డల నెదుర్కొనే ప్రశ్న, పదిమందికీ కనిపించేలా డాబూ దర్జా, ఇవి ప్రతిఒక్కరినీ కుంగదీసి ముందుకడు గెట్టకుండా అడ్డుపడే అంశాలు. ఈ నాగరికత తాలూకు నియమ నిబంధనలన ఎవడైనా పాటించక పోతాడో, వాడికి లోకంలో అంతా చుక్కెదురే.

ఇంతదాకా, ఈ నాగరికత చేసిన అజ్ఞాపనలు పాటించకుండా జనానికి గత్యంతరం లేకపోయింది. ఈ సామాజిక వ్యవస్థ ఆధిక్యానికి తల వంచక తప్పేదికాదు. అధికార పానంతో షావుకారు ఉన్మత్తుడై పోయేవాడు. ప్రపంచం సమస్తం తన చెప్పుచేతల్లో వుందాయె. రాజైనా ధనస్వామి అజ్ఞానువర్తే; మంత్రులైనా అతని బానిసీల్లే; యుద్ధానికైనా శాంతికైనా కావలసిన తాళం చెవులు తన అధీనంలోనే; తన పేరాశముందు లోకం సమస్తం జోహారే; భూఖండం ఏదైనా అతని కాలి ముచ్చెలకిందే.

అయితే ఇప్పుడిప్పుడు వశ్చిమాన ఒక నవ్యనాగరికతా సూర్యోదయమౌతుంది. షావుకార్ల లేదా పెట్టుబడిదారీ నాగరికతను గెంటివేసిందిది. ఈ నూతన వ్యవస్థకు మూల సూత్రం ఏమిటంటే, కాయకష్టం చేసిగానీ మానసిక శ్రమచేసిగానీ ఉత్పత్తి చేసే వాడు ప్రతి ఒక్కడూ రాజ్యంలోనూ సంఘంలోనూ అత్యంత గౌరవ నీయుడు అవుతూవుంటే, తదితరుల శ్రమద్వారా సమకూరిన నంపదో అమ్మా అబ్బాయిచ్చిపోయిన నంపదో వున్నవాడు జీవరాసులలోకెల్లా నీచుడనిపించుకుంటున్నాడు. దేశ పరిపాలనలో అతనివాణి మూగబడిపోతూంది. పౌర హక్కులను సైతం పొందలే కున్నాడు. ఈ అపూర్వ మహాశక్తి చూచి ధనస్వామి చచ్చేంత భయంతో పిచ్చివాడిలా లోకమంతా తిరుగాడుతున్నాడు, ప్రపంచ ధనస్వాములు యావన్మందీ ఈ నూతన నాగరికతను చూచి కళ్లు పొడుచుకొని శాపనార్థాలు పెడుతున్నారు. వ్యక్తి స్వేచ్ఛకూ మత స్వేచ్ఛకూ ఎవరి ఇష్టానుసారం వారు నడుచుకునే హక్కుకూ ఇది బద్ధవిరోధి అంటున్నారు. ఇవాళ తిట్టిన తిట్లు రేపు తిట్టకుండా కొత్త కొత్త తిట్టుమాటలు ప్రయోగిస్తూ, ఈ కొత్త నాగరికతను న్యూనపరిచే హేయమైన కట్టుకథలకూ నిందా ప్రచారాలకూ దిగుతున్నారు కారునల్లటి రంగుతో దాని రూపాన్ని చిత్రిస్తున్నారు. ద్వేషంతో గూడిన దుర్భాషలు వాడుతున్నారు. ధనిక వర్గాల చేతి సాధనాలన్నిటినీ ఈ విష ప్రచార నిమిత్తం సమకూర్చుకొంటున్నారు. అయితే సత్యం కాంతిబాణంగా ఈ కారుచీకట్లను చీల్చుతూ ప్రతిచోటా తన వెలుగు వెదజల్లుతూంది.

వ్యక్తి స్వేచ్ఛకుండిన కోరలనూ గోళ్లనూ ఈ నవ్య నాగరికత విరగగొట్టి వేసిందనడం నిస్సందేహం. ఆ పేరుతో ఒక పెట్టుబడి దారు వేలవేల పనివారి రక్తాన్ని జుర్రుకునేవాడు. ఇప్పుడలా బలవలేడు. ప్రజల నిత్యావసర వస్తువుల ధరలను వెనకటిలా తన చిత్తం వచ్చినట్టుగా పెంచి వెయ్యలేడు. తన వర్తక సరుకులకు మంచి మార్కెట్లకోసమని యుద్ధాలను రెచ్చగొట్టే స్వేచ్ఛ తనకిప్పుడు లేదు. స్వేచ్ఛ అంటే ఇదే అయితే, అది ఈ నాగరికతలో తనకు నిజంగానే లేదు. స్వేచ్ఛ అంటే అర్థం చాలినంత గృహవసతీ, ఆరోగ్యకరమైన జీవన పరిస్థితులూ, పుష్టికలిగించే తిండీ, శుభ్రమైన పల్లెపట్టూ, ఎలక్ట్రిక్ దీపకాంతీ, ఫాన్‌లగాలీ, సాదా జనానికి సత్వరమైన సరసమైన న్యాయావకాశాలు అయితే, ఆ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అత్యంత నాగరికతమయ్యాయని చెప్పే దేశాల్లోనూ నేడు కనిపించవు. పురోహితులు, పూజారులు, ముల్లాలు వగైరా గూడిన పరాన్నజీవులతో వర్గం దుర్గర్వంలో చేసే బోధనలూ, గుడ్డి నమ్మకాలూ-మత స్వాతంత్ర్యమంటే ఇవే ఐతే, ఆ కొత్త సమాజంలో ఇలాంటి స్వేచ్ఛ లేదు. నిజమే. మత స్వాతంత్ర్యమంటే అర్థం ప్రజలకు సేవ, సహన భావం, సంఘ శ్రేయస్సు కోసం వ్యక్తి స్వార్థత్యాగం, చిత్తశుద్ధి, శుభ్రమైన దేహమూ మనస్సూ అనుకుంటే, ఈ కొత్త సమాజంలో వున్నపాటి మత స్వాతంత్ర్యం ఏ ఇతర దేశంలో కలలోకి గూడా రానంత.

ఒక మనిషో మరొకడో సొంతదారైన సంపద మూలంగా ఎక్కడెక్కడైతే అసమానత వుందో, అక్కడల్లా ఈర్ష్యాసూయలూ, జబర్దస్తీ, జులుం, దౌర్జన్యం, దగా, అబద్ధమైన నేరారోపణలూ, పడుపువృత్తీ, వ్యభిచారమూ ఉండటం తప్పనిసరి కాని, ఎక్కడైతే సంపద అతిశయంగా వుండదో, ఎక్కడైతే మనుషుల్లో హెచ్చు మందికి ఒకే విధమైన పరిస్థితి వుంటుందో, అక్కడ ఒకణ్నిచూచి మరొకడెందుకు యీసు పెంచుకోవాలి? అలాంటి వ్యవస్థలో స్త్రీలు తమ మానాన్నమ్ముకొని వ్యభిచారానికి ఎందుకు దిగాలి? కోర్టు వకీలయ్యేలా మనుషుల్ని ప్రేరేపించి ఆకర్షించేది ఏది వుంటుందక్కడ? దొంగలూ దారిదోపిడిగాళ్లూ వగైరాల దురాగతాలకు

ఆ వ్యవస్థ ఎందుకు బలౌతుంది? ఈ దుర్గుణాలూ అవలక్షణాలూ అన్నీ కూడా ధనం ఇచ్చినవరాలే, ధనం పండించిన దుష్టఫలాలే - ధనస్వామ్య సంస్కృతి మాత్రమే వీటిని సృష్టించింది, వీటిని పెంచి పోషించేదీ, ఇదంతా దైవ నిర్ణయం ప్రకారమే ఏర్పడిందనీ విధాయకమనీ భావించవలసిందిగా అణగదొక్కబడిన, దోపిడీ పాలైన, పరాజితులైపోయిన ప్రజలను కోరేదీ కూడా ఈ నాగరికతే. జనం అసంతృప్తి చెందినట్టో తిరుగబడనున్నట్లో ఏ కొద్దిపాటి సూచన కనిపించినా, తక్షణమే పోలీసులూ, న్యాయస్థానాలూ, జైళ్లు రంగంమీదికి వచ్చి జనాన్ని తమ తమ స్థానాల్లో నిలిపిపెడుతాయి. నువ్వు ఒకవైపు తాగుతూ మరోవైపు కైపునెత్తికెక్కకుండా వుండలేవు. అలాగేనువ్వు అగ్గినిరాజేసి, అది మంటమండకుండా చెయ్యలేవు. శాపాల్లాంటి ఈ అక్రమాలన్నింటినీ సృష్టించి ఈ లోకాన్ని నరకూపంగా మార్చివేసిందీ నాగరికతే. ఈ స్వర్ణారాధనను ఆపు, తదితర దుర్గుణాలు తమంత తామే అంతరిస్తాయి. రెమ్మల్నీ ఆకుల్నీ కత్తిరించి చెట్టు వేళ్లని మాత్రం పదిలంగా వుంచడంలో అర్థమే లేదు. ధనపరత్వం మనిషికి అధమ ప్రవృత్తి కల్పించేదనీ, అవమానకరమనీ, ప్రాణాంతకమైన విషతుల్యమనీ ఈ కొత్త సమాజం భావం. ఇందులో ఎవడైనా ఒకడు తన వైభోగం వెలగబెడుతూ డంభం ప్రదర్శిస్తూ జీవిస్తున్నాడనుకో, తదితరులు అతన్ని జూచి తమ కళ్లలో నిప్పులు పోసుకోరు. అసహ్యించుకుంటారు. ఆపాద మస్తకం నగలు ధరించిన స్త్రీని జగదేక సుందరి అనుకోరు, తక్కువ చూపు చూస్తారు. ఆబగా తాగడం దుర్గుణమే ననుకుంటారు. గనక ఎవడూ అక్కడ తాగుబోతుకాడు. మతపరమైన దృక్పథంతోగాక, సంఘపరమైన దృక్పథంతో ఈ అవలక్షణాన్ని చూస్తారు. తాగుబోతుతనం ఓరిమినీ, సహనాన్నీ, శ్రమించాలనే కోరికనీ, గట్టిగా పనిజేసే శక్తినీ నశింప జేస్తుందని గ్రహిస్తారు.

ఏ ఒక్కడి దురాశ నెరవేరటానికో, వాడు తన సొంత లాభం కోసం వారి శ్రమను దోచుకునేందుకో, జన సామాన్యాన్ని వట్టి పనిముట్లుగా వుపయోగించుకుందామనుకుంటే ఈ నాగరికత అనుమతించదు. ప్రభుత్వ పదవులుండీ లంచాలు పట్టి రాజాల్లాగా మెలిగే స్వేచ్ఛను ఎవ్వరికిగానీ ఇవ్వదు. ఇక్కడ అత్యున్నతాధికారి ఆర్జన నిపుణుడైన వృత్తి జీవి ఆర్జనకంటె ఎక్కువేమీ లేదు. అతగాడు నివసించేందుకు మహాభవనాలేమీ వుండవు; మూడో నాలుగో గదులతో తృప్తి పడవలసిందే. అతని సతీమణి రాజుగారి దేవేరిలాగానో, సుల్తాన్ వారి బేగంలాగానో బహుమతి ప్రదాన సభలకు వస్తూ పోతూ వుండదు; తానూ తన బతుకుదెరువు కోసం శ్రమించే సందర్భాలే హెచ్చు; ఏ పత్రికా కార్యాలయంలోనో పని చెయ్యాలి, తప్పదు. ప్రభుత్వ ఉద్యోగం సంప్రాప్తించిందిగదా. మనకేమిక? మనం అధినాథులమయ్యాం పొమ్మని అనుకునే ఆస్కారం వుండదు; తాను ప్రజాసేవకుల్లో మరొకణ్ణనే అనుకుంటాడు. ధనస్వామ్య సంస్కృతిని మెచ్చేవాళ్లకు ఈ నూతన వ్యవస్థంటే సరిపడదు. ఎందుచేతనంటే, సంపదను కూడబెట్టి తదితరులమీద పెత్తనం సాగించే అవకాశానికే ఇందులో చోటు లేదు. అయితే ధనస్వామ్య వ్యవస్థకు తెలిసిగానీ తెలియకగానీ తోడ్పడుతూనే బలపరుస్తూనో, ఈ కొత్త నాగరికతను గెలిచేస్తూ అపఖ్యాతిపాలు జేసేవాళ్లను వారి బానిస మనస్తత్వాన్ని చూచి జాలిపడాలి. దురాశ, స్వార్థపరత్వం మనిషిలో ఇంకా క్షుద్రమైన లక్షణాలు పునాదిగా కట్టిన ఈ వ్యవస్థను, మానవీయత ధార్మికత, ఉదాత్తత గలిగిన వాడెవ్వడూ శ్లాఘించడు. దేవుడు ఒకవ్యక్తికి విద్యాసం పదనూ కళాదక్షతనూ ఇచ్చివుంటే, మానవ సమాజానికి చేసే సేవలోనే వాటికి పూర్తి సార్థకత వుంటుంది. మానవ సమాజాన్ని బానిసలుగా మార్చడానికో, జనాన్ని దోచుకోవడానికో, దగా చెయ్యడానికో వీటిని వినియోగ పెట్టడం అక్రమం.

ధనవంతుడి పాలనకూ వ్యక్తి ఆస్తికీ ప్రాణాంతకంగా పరిణమిస్తున్న ఈ నాగరికత ధన్యమైనది. ముందు వెనకలుగా మిగిలిన ప్రపంచం దీని అడుగుజాడల్లోనే నడవ వలసి వుంటుంది. సాంఘికంగానూ మతపరంగానూ ఈ దేశానికో, ఆ దేశానికో ఈ వ్యవస్థ సరిపోదని గానీ, ఈ దేశం పరిస్థితులకో, ఆదేశం పరిస్థితులకో అది అమరదని గానీ అనడం అసందర్భం. క్రైస్తవమతం విత్తులు జెరూసలెంలో మొలకెత్తాయి; దాని సువాసన లోకమంతా వ్యాపించింది. బౌద్ధమతం భారతదేశం ఉత్తరాదిలో పుట్టింది. మానవకోటిలో సగభాగం దానికి శిష్యుడుగా మారింది. మనిషి ఎక్కడైనా ఒకలాగే వుంటాడు. స్వల్పమైన తేడాలుండవచ్చునేమోగాని మౌలికంగా మాత్రం ఒకదేశ ప్రజలకూ మరొక దేశ ప్రజలకూ విభేదాలు లేవు. ఒక దేశానికి సత్ఫలితాల నిచ్చిన రాజ్య నిర్మాణమూ సంఘ వ్యవస్థా తదితర దేశాలకు గూడా అంతే మంచి ఫలితాలనిస్తాయి. ధనస్వామ్య వ్యవస్థ గానీ దాని బంట్లూ ఏజంట్లూ గానీ, దీన్ని ప్రతిఘటించేదాన్ని గురించి దుష్ప్రచారం సాగించేందుకూ ప్రజల కళ్లలో దుమ్ముగొట్టి వాళ్లను తప్పుతోవ పట్టించేందుకూ తమకుగల యావత్ శక్తినీ వినియోగిస్తారు. నిజం. అయితే, ఏమైనాగానీ, అంతిమ విజయం మాత్రం నూతన వ్యవస్థదే.

(సృజన, ఆగస్ట్/సెప్టెంబర్ 1980) ❑

# రెండు రెళ్ళు ఆరు

ఆసక్తి కలిగించి, ఆలోచింపజేసే గణాంకాలతో కూడిన 'రెండు రెళ్ళు ఆరు' అనే కొత్త శీర్షిక ప్రారంభిస్తున్నాం. వీక్షణం పాఠకుల కోసం సి.డి.ఆర్.పి రీసెర్చి విభాగం ఈ శీర్షికను సమర్పిస్తోంది. -సంపాదకుడు

## భారత్ చైనాల అభివృద్ధి - ఒక పరిశీలన

| | తలసరి ఆదాయం | మార్కెట్ సంస్కరణలు మొదలైన సం. | విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు | ఎగుమతులు | విద్యపై ఖర్చు | ఆరోగ్యంపై ఖర్చు | అక్షరాస్యత | జనాభా |
|---|---|---|---|---|---|---|---|---|
| చైనా | 3976 డాలర్లు | 1978 | 52 బిలియన్ డాలర్లు | 320 బిలియన్ డాలర్లు | జిడిపిలో 2.3% | జిడిపిలో 2.1% | 84% | 130 కోట్లు |
| భారత్ | 2358 డాలర్లు | 1991 | 4 బిలియన్ డాలర్లు | 35 బిలియన్ డాలర్లు | జిడిపిలో 3.2% | జిడిపిలో 1.3% | 65% | 106 కోట్లు |

## అసమానతల ప్రపంచం

- ప్రపంచంలో తయారైన అన్ని వస్తువుల్లో 86 శాతాన్ని అత్యంత ధనవంతులైన 20 శాతం మంది వినియోగిస్తారు. అదే అత్యంత పేదలైన ఇరవై శాతం ప్రజలు మాత్రం 1.3 శాతం వస్తువులను మాత్రమే వినియోగిస్తారు.
- ప్రపంచంలో అత్యంత ధనవంతులైన ముగ్గురి ఆస్తులు 48 పేద దేశాల జాతీయాదాయం కన్నా ఎక్కువ.
- ప్రపంచంలోని అత్యంత ధనవంతులైన 225 మంది ఆస్తిపై 4 శాతం పన్ను వేస్తే ప్రపంచంలోని ప్రజలందరికీ ఆహారం, వైద్యం, మంచినీరు వంటి సౌకర్యాలు కలిపించవచ్చు.
- ప్రపంచంలో అత్యంత ధనవంతులైన 1 శాతం ప్రజల ఆదాయం అత్యంత పేదవారైన 50 శాతం ప్రజల ఆదాయంతో సమానం.

# సి డి ఆర్ సి కార్య క్షేత్రాలు

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చి అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.) పేరులోనే ఈ సంస్థ డాక్యుమెంటేషన్ (సమాచార సేకరణ, సంరక్షణ), రీసెర్చ్ (పరిశోధన, విశ్లేషణ), కమ్యూనికేషన్ (సమాచార వినిమయం, ప్రచారం) అనే మూడు ప్రధాన కార్య క్షేత్రాలలో పని చేస్తుందనే సూచన ఉంది. ఈ మూడు కార్యక్రమా లను విడివిడిగానో, కలిసికట్టుగానో చేస్తున్న సంస్థలు కొన్ని ఉన్నాయి. సి.డి.ఆర్.సి విశిష్టత ఈ మూడు పనులను సమగ్ర దృష్టితో, ఒకే ప్రక్రియలో భాగంగా చూడడంలో మాత్రమే కాక, ప్రజా అనుకూల దృష్టినుంచి చూడడంలో కూడ ఉంది.

ఈ దృక్పథంతో సి.డి.ఆర్.సి ప్రాథమిక క్షేత్ర పరిశోధనల ద్వారా, సమాచార సంరక్షణ ద్వారా, భాగస్వామ్య పరిశీలన ద్వారా, పరిమాణాత్మక విశ్లేషణ ద్వారా, సైద్ధాంతిక చర్చ ద్వారా, ద్వితీయ స్థాయి వనరుల అన్వేషణ ద్వారా సమాచారాన్ని సేకరిస్తుంది. సమాచారాన్ని ప్రోదిచేస్తుంది. ఇలా సేకరించిన సమాచారపు కవిలె కట్టలన్నిటినీ సి.డి.ఆర్.సి ఇతర పరిశోధకులతో పంచుకుంటుంది. సమాచార వినిమయం ద్వారా, అభివృద్ధి ద్వారా ఉన్న పరిజ్ఞానం మీద కొత్త వెలుగులు ప్రసరిస్తుంది. పరిశోధన, అభివృద్ధి, చర్చ, విశ్లేషణ అనే క్రమంలో సమాచారానికి మెరుగులు దిద్దుతుంది.

సి.డి.ఆర్.సి కార్యక్షేత్రాలలో ప్రధానమైనది పరిశోధన. ప్రత్యేకంగా ప్రభుత్వ, ప్రజా సంస్థలు కోరే విషయాలపైన గాని, సొంతంగా తానే అన్వేషించదలచుకున్న విషయాలపైన గాని సిడిఆర్‌సి పరిశోధనలు నిర్వహిస్తుంది. ఆయారంగాల పరిశోధనా ఫలితాలను ప్రచురించి, ఫలితాలపై, నిర్ధారణలపై చర్చ జరిగి సమాజం తన గురించి తాను ఎక్కువ తెలుసుకోవడానికి దోహదపడుతుంది. సమాజంలో ఎన్నో పరిశోధనార్హమైన అంశాలు న్నాయని , వాటి మీద సవివరమైన పరిశోధనలు జరిపి వాస్తవాలపై ఆధారపడిన నిర్ధారణలకు రావడం అవసరం అని సి.డి.ఆర్.సి. భావిస్తోంది.

సమాచార సేకరణ, పరిశోధనల వల్ల సహజంగానే సి.డి.ఆర్.సి. మూడో కార్యక్షేత్రమయిన సమాచార వినిమయంలోకి ప్రవేశిస్తోంది. సేకరించిన, పరిశోధించిన సమాచారాన్ని ఎప్పటికప్పుడు ప్రజలకు చేరవేయడానికి సి.డి.ఆర్.సి. ప్రయత్నిస్తుంది. ఈ సమాచార వినిమయంలో భాగంగా సదస్సులు, వర్క్‌షాపులు నిర్వహించడం, వార్తా ప్రచార పత్రికలు, నివేదికలు ప్రచురించడం, పరిశోధనాంశాలతో పుస్తకాలు, అధ్యయనాలు ప్రచురించడం సి.డి.ఆర్.సి. పనులుగా ఉంటాయి. ఇప్పటికే సి.డి.ఆర్.సి. **వీక్షణం** సామాజిక ఆర్థిక పత్రికను ప్రచురిస్తోంది.

## సి.డి.ఆర్.సి. స్థాపకులు




- ప్రొ. ఆర్.ఎస్. రావు, సంబల్‌పూర్ విశ్వవిద్యాలయ ఆర్థికశాఖ ఆచార్యులు (రి)
- ప్రొ. కె.ఆర్. చౌదరి, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ వ్యవసాయ ఆర్థికశాఖ ఆచార్యులు(రి)
- వి. హనుమంతరావు, సీనియర్ పాత్రికేయులు, డేటాన్యూస్ ఫీచర్స్ స్థాపకులు
- ప్రొ. ఎం. భారతి, బుర్లా (ఒరిస్సా) ఇన్‌స్టిట్యూట్ ఫర్ స్టడీ ఆఫ్ సొసైటీ అండ్ కల్చర్ స్థాపకులు
- బి. ఎస్. రాజు, మెకానికల్ ఇంజనీర్, కన్సల్టెంట్
- పి. అరవింద, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రొఫెషనల్
- సి. వనజ, ఎలక్ట్రానిక్ మీడియా ప్రొఫెషనల్

డైరెక్టర్: ఎన్. వేణుగోపాల్, సీనియర్ పాత్రికేయులు, **వీక్షణం** సంపాదకులు

## 'వీక్షణం' చందాదారులుగా చేరండి!
## 'వీక్షణం'ను మిత్రులకు పరిచయం చేయండి!

తెలుగు నాట విలక్షణమైన ఆర్థిక, సామాజిక పత్రిక 'వీక్షణం' ను రెండు సంవత్సరాలకు పైగా ఆదరించి పోషిస్తున్న మిత్రులందరికీ 'వీక్షణం' సంపాదకవర్గం వినమ్రంగా ధన్యవాదాలు తెలుపుతోంది. అయితే తెలుగుసీమలో రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాల విశ్లేషణ కోసం ప్రజలలో, పాఠకులలో, ఆలోచనా పరులలో వ్యక్తమవుతున్న తహతహకూ, ఆ ఆసక్తిని తీర్చడంలో 'వీక్షణం' చేస్తున్న కృషికీ మధ్య చాల అంతరం ఉంది. ఆ అంతరం పూడాలంటే 'వీక్షణం' కు పాఠకుల నుంచే ఇతోధిక సహకారం అందాలి. 'వీక్షణం' చందాదారుల సంఖ్య కనీసం మూడురెట్లు పెరిగితే గాని, 'వీక్షణం' తన ముందు పెట్టుకున్న కర్తవ్యాలను తీర్చడం సాధ్యం కాదు. అంటే 'వీక్షణం' పాఠకులలో ప్రతి ఒక్కరూ తమ చందాలను క్రమం తప్పకుండా పునరుద్ధరించుకోవడంతో పాటు, కనీస మరొక ముగ్గురు మిత్రులకు 'వీక్షణం' ను పరిచయం చేసి చందాలు కట్టించాలి.

'వీక్షణం' చందాదారులుగా చేరండి!
మీ మిత్రులను 'వీక్షణం' చందాదారులుగా చేర్చండి!
ఇది వీక్షణం కు సాయం కాదు, తెలుగు సమాజం తన గురించి తాను
తెలుసుకోవడానికి చేసే అన్వేషణకు సాయం!

**వీక్షణం విడిప్రతి రు. 12 సంవత్సర చందా రు. 150, దశాబ్ది చందా రు. 1,000**
**చందాలు కింది చిరునామాకు ఎం.ఓ./డి.డి. ద్వారా పంపవచ్చు.**

**సంపాదకుడు, వీక్షణం, సిడిఆర్‌సి, మైత్రి రెసిడెన్సీ,**
**3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.**

## మీలోని రచయితను వెలికి తీయండి!
## 'వీక్షణం'మీ రచన కోసం వేచి చూస్తోంది!

మీ చుట్టూ, మీ గ్రామంలో, మీ బస్తీలో, మీ పని స్థలంలో, మీరు పనిచేసే సంఘంలో ఏదో ఒక ఘటన మిమ్మల్ని కదిలిస్తుంది. మీలో ఆలోచనలు రగిలిస్తుంది. ఆ ఘటన వెనుక ఉన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక మూలాల గురించి మీరు అన్వేషిస్తుంటారు. మీ ఆలోచనలను రాయండి. సరిగ్గా 'వీక్షణం' ఎదురు చూస్తున్నది అటువంటి క్షేత్ర నివేదికల కోసమే. 'వీక్షణం' ఆర్థిక, సామాజిక పత్రిక తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే ఆలోచనలకు, అన్వేషణలకు ఒక వేదిక. మీరు అట్టడుగు నుంచి, మీ అనుభవాల నుంచి పంపే నివేదికలు ఆ ఆలోచనల్లో, అన్వేషణల్లో భాగమే.

'వీక్షణం' ను ఇటు క్షేత్ర నివేదికల, అటు నిపుణుల విశ్లేషణల మేలు కలయికగా తీర్చిదిద్దాలని సంపాదకవర్గం ప్రయత్నిస్తోంది. మన జీవితాల మీద ప్రగాఢ ప్రభావం వేయగల అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ పరిణామాల మీద నిపుణుల విశ్లేషణలు ఎంత అవసరమో, ఆ పరిణామాలు అట్టడుగు మనుషుల జీవన సరళిని ఎట్లా మారుస్తున్నాయో కింది నుంచి నివేదించడమూ అంతే అవసరం.

**వీక్షణం మీ పత్రిక వీక్షణం మన పత్రిక**
**వీక్షణం తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణ. ఆ అన్వేషణలో భాగం పంచుకోండి.**
**రచనలు పంపవలసిన చిరునామా:**

**సంపాదకుడు, వీక్షణం, సి.డి.ఆర్.సి, మైత్రి రెసిడెన్సీ,**
**3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.**

**PRINTED BOOK**

*RNI Regn. No. APTEL/2003/11482* *Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06*

# అగ్రగామి ఆంధ్రప్రదేశ్





- ఊరూరా, వాడవాడల పర్యటిస్తూ, ప్రజలను పలకరిస్తూ సమస్యలను పరిష్కరించే ప్రయత్నమే 'రాజీవ్ పల్లెబాట'
- ప్రతి గ్రామాన్ని ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేసి వారికి ఆన్‌లైన్ ద్వారా సమాచారం అందించడం కోసం 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్'
- నిరుద్యోగ యువత కోసం ఉపాధి లక్ష్యంగా 'రాజీవ్ యువశక్తి'
- రూ. 500 కోట్లతో ఎస్.సి., ఎస్.టి, బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు 'ఇందిర ప్రభ'
- రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో వ్యవసాయానికి అత్యంత ప్రాధాన్యతనిస్తూ, నీటిపారుదల, ఇతర అనుబంధ రంగాలకు మూడవ వంతు నిధులు
- పారిశ్రామిక ప్రగతికి పెద్దపీట, విశాఖ సమీపంలో 2120 ఎకరాలలో రూ.182 కోట్ల వ్యయంతో రూపుదిద్దుకోనున్న 'మెగా ఫార్మాసిటీ'
- వచ్చే ఐదేళ్లలో రికార్డు స్థాయిలో 46 వేల కోట్ల రూపాయల ఖర్చుతో నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రణాళికలు

*Owned, Printed and Published by V. Hanumantha Rao at G1 Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad-500 029 Ph : 55843495 DTP at Samata Graphics, Hyderabad, Printed at Charita Impressions, Azamabad, Hyderabad. Editor: N. Venugopal*

**VEEKSHANAM**
G1, *MYTHRI RESIDENCY,*
3-6-394, Road No. 3, Himayatnagar, Hyderabad-500029.